

డి.వి.యస్. ప్రొడక్షన్స్
పిడుగు రాముడు
దర్శకత్వం:
బి.విఠలాచార్య
నిర్మాత: డి.వి.యస్.రాజు
రచన: సముద్రాల జూనియర్ • సంగీతం: టి.వి.రాజు.
పూర్ణా రిలీజ్

## కథలు

కుమారి పి. వి. శకుంతలగారి "కథ తెచ్చిన వ్యథ" చదివాను. చాలా సరదాగా వున్నది. రచయిత్రి తెవరో పురుషలోకం మీద కసి తీర్చుకున్నారని "మధాకర్" ద్వారా కథలో చెప్పించి, ఆ సుధాకర్‌ద్వారానే పురుష లోకంపైగల కసంతా శకుంతలగారు తీర్చుకొన్నారు. సుధాకర్‌ని మరీ ఆడపిల్లలకు సమాధానమివ్వలేని పిల్లిగా రూపొందించటం అతని గడుసరి తత్వమునకే సవాలు. ఏమైనా ఈ రోజులకుతగ్గ ఈ కథ బాగుందనుటలో సందేహంలేదు.

నండూరు పద్మనాభరావు (విజయవాడ)

* * *

ఆంధ్ర సచిత్రవారపత్రికలో ప్రచురించిన "మితభాషి" కథ వన్నెంతో ఆకర్షించినది. వాస్తవికానికి చాలా దగ్గరగా వున్నది. కానీ రచయిత గారు చిన్న పొరబాటు చేశారు. ఏమంటే ప్రసన్నకు, కృష్ణవేణికి తాయారమ్మ బ్రతి కుండగానే ఆ కాస్త మూడు ముళ్లు వేసి యుంటే చాలా బాగుండేది. మొత్తం మీద కథ చాలా బాగుంది.

డి. వి. రామారావు (టి. సాదం)

* * *

'సర్కార్ ఎక్స్‌ప్రెస్' కథ చాలా బాగుంది. శేఖరం పెళ్లికి ఆవేశే వెళ్లడము విచిత్రంగా ఉంది.

ఎస్. తులసీరావు (అనకాపల్లి)

* * *

"ఆషాఢస్య ప్రథమదివసే" కథ చదివాను. చాలా బాగుంది. ఇటువంటి కథలు క్రొత్త దంపతులకు ఎక్కువ ఉపయోగ పడుతాయి.

డి. వి. ఎల్. రాంబాబు (విజయవాడ)

# ఉత్తరాలు

29—7—66 పత్రికలో అచ్చు గొట్టిన "తెల్లకొక్క" కత సద్విన. నవా బాగుంది. సద్వుసున్నంత సేపు, మా వూరు, మా మావ బిడ్డ సెంద్రి, మేము చిన్న పోరగాండ్ల మున్నప్పుడు అద్కున్న సెర్వు గట్టు, ఒర్రెలు అది కొచ్చి పత్రిక అనంత కనిపెట్టె, మా గుడిసె 'సూరు' మాస్కుంట గూసున్న. యాడంగనో మా నంటో డొచ్చి, మీద బడిండు. మల్లా పత్రిక తీస్కొని సద్వు తందుకు సురువుజేసిన. కత ఆయింత సద్వంగనే, వామన్సుల ముల్లు గుచ్చి వట్లైంది.

"నా లచ్మి విన్న ఇవారకు బర్రె గడ్డ మీన కల్తా నన్నది. ఇయ్యాల బర్రె గడ్డ మీన వంటాని కొచ్చినవా" అన్న సెంద్రి గాని మాటలకు, నాకు ఏడ్పు ఎత్తేస్కొచ్చింది. ఏడ్సుదా మనిపించింది. ఆడనె నాకు ముంగట మా యవ్వ గూసుంది. 'అడి పోర గాండ్లోలే ఏడ్సు తవు' అన గల్లదని, కంటి పొంటె కార్తున్న నీళ్లను తుడ్సుకున్న,

మరిగట్ల ఆకత రాసినాయన గంత సక్కంగ రాసి, ఆకిరికి పేమించుకున్నోళ్లను ఎడబాపిండు. ఆ పాపం అన్కే నుట్కుంటది.

'ఏహే.... నీ.... భగమంతుడే అనుంటోడు.... మంచోల్లనే ఎల్లెం గొండ పోతడని' అన్న మాటలు యాడికెల్లో యి వొచ్చి యిస్రిత్మైంది..

కె. నరేంద్ర (బొంబాయి)

29—7—66 నందు ప్రచురించిన "తెల్లకొక్క" కథ తెలంగాణ ప్రాంతమునందు వాడబడు భాషయని వ్రాసినారు. ఇది అబద్ధమని తెలుపుటకు చింతించుచున్నాను. "తెల్లకొక్క"లో వాడబడిన భాష కేవలము కరీంనగర్ జిల్లా ప్రాంతమునందు మాత్రమే వాడకములోయున్నది. ఈ భాష మహబూబు నగర్, హైదరాబాదు, మెదక్, నల్లగొండ, ఖమ్మం, మరియు వరంగల్లు జిల్లాలలో ఎచ్చటను కానరాదు. ఈ భాష తెలంగాణము యొక్క భాష యని ఎవరు తెలిపినారో, తెలుపవలసినదిగా కోరుచున్నాను. మరియు ఇకముందు తెలంగాణా ప్రజలను గురించి ఇటువంటి అసత్య ప్రచారమునకు పూనుకొనవలదని కోరుచున్నాను.

కొంగర అనంతరాం (మహబూబ్‌నగర్)

## వ్యాసాలు

"సమాజంలో గ్రామసేవిక ఎదుర్కొనే సమస్యలు" అన్న రవిగారి వ్యాసం చదివేను. గ్రామస్తులను గురించిచెపుతూ ఇల్లా వ్రాశారు. "మంచినీళ్లు అడిగితే మూతి ముడుచుకొనే ఆడవాళ్లు". ఎంతోదూరంనుంచి నడిచివచ్చి, గ్రామసేవిక మంచినీళ్లు అడిగితే బాధపడే ఆడవాళ్లు ఇంకా మన గ్రామాదులలో వున్నారా? "బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసర్, అగ్రికల్చరల్ ఎక్స్టెన్షన్ ఆఫీసర్, జీపులో ప్రక్క గ్రామానికి పోతుంటే బ్రతిమాలి జీపులో ఎక్కింది" అని వ్రాశారు. వయసులో వున్న గ్రామసేవిక డ్యూటీమీద పోతూ 'లిఫ్ట్' గురించి బ్రతిమాలవలసివచ్చిందన్న మాట. ఇలాటి ఆఫీసర్లు కూడా మన బ్లాక్ ఆఫీసులలోవున్నారా? పల్లెలని గురించి మరోచోట ఇలా వ్రాశారు. "పట్నాలలో అంతస్తులమీద అంతస్తులు పెరిగిపోతుంటే పల్లెలలో గుంటలలో గుంటలు పడుతున్నాయి". ఎంతముఠా తత్వాలు వున్నా, ఇంత అధ్వాన్నంగా వున్న పల్లెలు ఇంకా వున్నాయా మన రాష్ట్రంలో ?

మరోచోట ఇలా వ్రాశారు. "దారిలో రోడ్డుకడ్డంగావున్న బురదలో జీపు దిగబడిపోయింది............ అనుకూలపుముఠా వాళ్లు వచ్చి జీపు బురదలోంచి వెలుపలికి లాగితే ప్రతికూలపు ముఠావాళ్లు వచ్చి బురదలోకి మళ్లీ నెట్టారు." ముఠాతత్వాలు ఎంతగా వున్నా ఇంతటి దుశ్చర్యకు పాల్పడేవారు మన గ్రామాదుల్లో వున్నారా?. నాకు మటుకు పై చెప్పిన విషయాలు సత్య దూరాల్లా వున్నాయి.

అలియా బేగం అన్సారి (టట్నాపూర్)

సీతారామాంజనేయ పిక్చర్స్ వారి

# సంగీతలక్ష్మి

కథ-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం　　నిర్మాతలు

గిడుతూరి సూర్యం - పి. నరశింగరావు - అమరా రామసుబ్బారావు

సంగీతం: యస్. రాజేశ్వరరావు













ఆంధ్ర/ రాయల్ ఫిలిమ్స్
సీడెడ్/ జయలక్ష్మి
నైజాం/ యస్.యన్.పి.పి
మైసూర్/ ఆర్.యస్. ఫిలిమ్స్

## ఉత్తరాలు

29—7—66 వ తేదీ పత్రికలో 'చేతికి నాలుగు వేళ్లుంటే'' అను వ్యాసము ప్రచురించినందుకు మాకు, దాని ద్వారా బైనరీ పద్ధతిని చాల సులభముగా తెలియపర్చినందుకు శ్రీ డాక్టర్ మహీధర నళినీమోహన్‌గార్కి చాల ధన్యవాదములు. ఈ వ్యాసమును వ్రాసిన శ్రీ డాక్టర్ మహీధర్ నళినీమోహన్‌గారు, వైజ్ఞానిక గాథాశతి వ్రాస్తున్న డాక్టర్‌గారు, మౌల్వీ నసీరుద్దీన్ కథలు వ్రాస్తున్న మహీధర్ నళినీమోహన్ గారు ఒకరేమో అను నా అనుమానము తీర్చెదరని ఆశిస్తున్నాను.

''చేతికి నాలుగు వేళ్లవుంటే'' అనే వ్యాసములో 234 ను బైనరీ పద్ధతిలో వ్రాసేటప్పుడు యిచ్చిన ఉదాహరణలోని చివరి స్టెప్‌లో అనగా 1 ని 2 చే భాగించేటప్పుడు విభక్తము ''సున్న''గాని 1 కాదు. ఈ పొరపాటు సవరించెదరని తలంచుచున్నాను.

వి. ఆర్. కె. రావు ''సిని'' (బీహార్)

*''చేతికి నాలుగువేళ్లే ఉంటే?'' అనే వ్యాసంలో రెండు పొరబాట్లు దొర్లినమాట నిజమే. ''కుడినుంచి ఎడమకు'' అని ఉండడానికి బదులు ''ఎడమనుంచి కుడికి'' అని పడింది. ఈ పొరబాటు నాది.

''1 ని 2 చే భాగిస్తే విభక్తం 1 వస్తుంది'' అని పడింది. ''సున్న'' అని ఉండాలి. ఈ తప్పు ముద్రణలో వచ్చింది. ఈ పొరబాట్లను సూచించిన పాఠకులకు కృతజ్ఞుణ్ణి.

**మహీధర నళినీమోహన్.**

* * *

శ్రీమతి భానుమతిగారి వ్యాసం అత్తగారు—అంతరాత్మ చదివాము. బాగున్నదికానీ అర్థమూ యింకా బాగా రావాలని అంటే ''అత్తగారు—అస్థిపంజరము'' అని ఉండవలసినది. కథల్లో 'తెల్లవారింది' 'కథతెచ్చి వ్యథ' చాలా బాగున్నవి.

కందర్ప శాంత (కాకినాడ)

### చిత్రం

8—7—66 సంచికలో వేసిన స్త్రీ చిత్రం టైప్‌రైటర్‌మీద వ్రాయుట అలవికానిపని. కనుక చిత్రకారుని వివరించ గోరుచున్నాము.

ప్రసాద్, మూర్తి, రావు (గుంటూరు)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 2—9—'66
పరాభవనామ సం॥ నిజ శ్రావణ మాసం బ॥ విదియ
సంపుటము : 58 సంచిక : 53

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1


క్రొత్తరేట్ల ననుసరించి 14—1—1966 మొదలు ఆంధ్రసచిత్ర వారపత్రిక చందా వివరాలు.

**భారతదేశం**

| | పోస్టుద్వారా రూ. పై. |
|---|---|
| సంవత్సర చందా | 19.25 |
| 6 మాసముల చందా | 9.62 |
| 3 మాసముల చందా | 4.80 |

**ఇతరదేశాలకు**
**ఓడమీద (Sea Mail)**

| | |
|---|---|
| సంవత్సర చందా | 32.00 |
| అర్థసంవత్సర చందా | 16.00 |

## వచ్చేవారం!

## గర్భంలోని శిశువు ఛాయాచిత్రాలు!

ఆధునిక వైజ్ఞానిక సాధన అభివృద్ధి!
సచిత్ర వ్యాసం!

# మనలో మాట

ఈ వారంతో మౌల్వీనసిరుద్దీన్ గురించి డా. మహీధర నళినీమోహన్ రావు రాసిన కథలు అయిపోతాయి. ఇవి పిన్నలకే కాక పెద్దలకి కూడా వచ్చి నట్లు మాకు అందే ఉత్తరాలని బట్టి తెలుస్తూ ఉంది...

* * *

కొంతకాలంగా లండన్‌లో ఉంటూ, చిత్రకారుడుగా పేరు సంపాదించు కున్న శ్రీ ఎస్. వి. రామారావు పేరు పాఠకులకి సుపరిచితమే. ఈ మధ్యనే లండన్‌లో జరిగిన ఒక ప్రదర్శన గురించి ఆయన రాసిన వ్యాసం ఈ సంచికలో వేస్తున్నాము. బొమ్మలు శ్రీ రామారావు పంపినవే...

* * *

విశాఖ ప్రస్తుతం ఒక కళాశాలలో అధ్యాపకులుగా ఉంటున్నారు. కాలేజీ విడిమవన్ల హడావుడి తగ్గిపోయింది కాబట్టి విశాఖ రాసిన 'చదువులూ— అభిప్రాయాలూ' కొన్ని ఉపయోగకరంగా ఉండే సూచనలు ఇవ్వవచ్చు!...

* * *

ఈ సంచిక ముద్రణ ప్రారంభం అయ్యే సమయానికి ఢిల్లీలో శ్రీ కామరాజ్ ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డితో జరిపిన చర్చల ఫలితాలు వెలువడలేదు...

# విషయానుక్రమణిక

ముఖచిత్రం : నటుడు శోభన్‌బాబు


పేలిపోకుండా — ఆవిరిని బయటకు వదలటం
ఎన్నిక వాయిదా
ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ రాజకీయాలు


కాశ్మీర్ సమస్య
మీరు ... పోకుండా ఉంటే అంతా బాగా పోతుంది
జయప్రకాశ్


మేము నమ్మం
బొంబాయి రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ
అర్జీ
వచ్చే ఎన్నికలలో మీనన్‌కి సీటు ఇవ్వటానికి బొంబాయి రాష్ట్ర కాంగ్రెస్ పార్టీ నిరాకరించింది —వార్త
OOMMEN


కుదరని సంబంధం
అయ్యో నన్నీ మొబారి నుంచి రక్షించండి
పరిమితమైన అవకాశాలు
పెద్ద ప్రణాళిక

# 'కథ అడ్డం తిరిగింది'

'కామరాజ్ పథకం' లక్ష్యం ఏదయినా దాని సహాయంతో కొందరు ముఖ్యమయిన రాజకీయ నాయకులని పదవులు వదులుకునేట్లు చెయ్యటం మాత్రం జరిగిందన వచ్చు. అందుకనే నేమో, ఈ పథకం కింద రాజీనామా ఇచ్చి మంత్రి పదవి కోల్పోయిన ఒక కేంద్ర మంత్రి వెంటనే తన రాష్ట్రంలో ముఖ్యమంత్రిని తొలగించి తమకి నచ్చిన వ్యక్తిని నియమించారు. కేంద్రంలో పదవి పోయినా సొంత రాష్ట్రంలో పలుకుబడి, బలం మాత్రం తగ్గలేదని నిరూపించారు. కాని, కేంద్రంలో పదవిలో, అధికారంలో ఉంటూనే తమ రాష్ట్ర రాజకీయ నాయకులని తోలు బొమ్మలవలె ఆడించాలని కోరే వారూ లేకపోలేదు! ఇటీవల ఆంధ్ర ప్రదేశ్‌లో జరిగిన హడావుడే దీనికి నిదర్శనం.

ఒకప్పుడు ఆంధ్ర ముఖ్య మంత్రి పదవిని అలంకరించి, ప్రస్తుతం కేంద్ర ప్రభుత్వంలో రవాణాశాఖమంత్రిగా, 'సిండికేట్' సభ్యుడుగా పేరుపొందిన శ్రీ నీలం సంజీవరెడ్డిగారు రాష్ట్ర రాజకీయాలలో కలగచేసుకొనాలనుకున్నారేమో, ఒకనాడు తమ మాజీ విరోధిఅయిన శ్రీ దామోదరం సంజీవయ్యతో చేతులు కలుపుతున్నామని ప్రకటించారు. అయితే రాష్ట్రంలో కాంగ్రెసుని ఉద్ధరించటానికి చేతులు కలుపుతున్నట్లు చేసిన ఈ ప్రకటన ఊహించినంత సంచలనం తీసుకురాలేదు. ఎవరినయితె ఉద్దేశించి పై ప్రకటన చేశారో ఆ వ్యక్తి కంగారుపడి పదవీచ్యుతులయి పోలేదు. కొందరు రాజకీయ నాయకులుమాత్రం ఈ అవకాశాన్ని వినియోగించుకొనటానికి ప్రయత్నించారు. ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానంద రెడ్డికి ప్రతిపక్షంగా ఉద్యమాలు లేవదీశారు. మంత్రివర్గంలోనే అవకతవకలు ఏర్పాటు చెయ్యటానికి పూనుకున్నారు.

ఈ ఎత్తుల వెనుక ఎవరి ప్రేరణ ఉన్నదీ స్పష్టంగా తెలుస్తూనే ఉన్నా కాంగ్రెసులో ఐకమత్యం అనే మిషతోనే కాంగ్రెసులో చీలికలు తీసుకురావటానికి ప్రయత్నిస్తూ వచ్చిన కొందరు కొన్ని రోజులు వార్తలతో కొంచెం ప్రముఖంగా కనిపించారు. ముఖ్య మంత్రి కొందరి పోర్టు ఫోలియోలు మార్చటంతో ఉద్రేకాలు అధికంగా ఉన్న వారికి పౌరుషాలు తక్కువ అని మాత్రం ఇవ్వని రాజీనామాల కథ వల్ల తెలిసి పోయింది. అప్పటినుంచీ ఇది బలా బలాల పోటీతో ముగియదనీ, శ్రీ సంజీవరెడ్డి ఇతర పద్ధతులలో శ్రీ బ్రహ్మానంద రెడ్డి మీద యుద్ధం కొనసాగించటానికి ప్రయత్నిస్తారనీ స్పష్టం అవుతూ వచ్చింది. కీ. శే. ఆలపాటి వెంకట్రామయ్య మరణంవల్ల ప్రదేశ్ ఎన్నికల సంఘంలో ఏర్పడిన ఖాళీలో ముఖ్యమంత్రి నిలిపిన అభ్యర్థి ఎన్నిక అయితే తమ బలహీనత మరింత బయట పడి పోతుందని ఆ స్థానంలో ఎన్నిక లేకుండా 'రాజీ— అభ్యర్థి'ని నియమించాలని ప్రచారం చెయ్యటం మొదలు పెట్టారు. ఆగస్టు 18 వ తేదీ జరగ వలసిన ఎన్నికని వాయిదా వెయ్యాలని మహజరు సహాయంతో కొందరు కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ కామరాజ్‌ని అర్థించారు. ముఖ్య మంత్రి మాత్రం తాము ఎన్నికకి ఏనాడయినా సిద్ధమేనని తెలుపుతూ వచ్చారు. ద్వేషలతో నిండిన వాతావరణంలో ఎలెక్షన్ జరగటం మంచిది కాదు కాబట్టి దానిని వాయిదా వెయ్యవలసినదిగా శ్రీ కామరాజ్ సలహా ఇచ్చినా ఆగస్టు 18 వ సభ్యులు యధావిధిగా సమావేశమయి ఒక తీర్మానం చేశారు. ఈ తీర్మానాన్ని 170 మంది బలపరిచారు. దానిని ఎదిరించిన 80 మందీ వోటింగులో పాల్గొనే ధైర్యం లేక నిష్క్రమించారు. ముఖ్య మంత్రి కావాలన్న అభ్యర్థినే ఎన్నుకునే షరతు మీద ఎన్నిక వాయిదా వెయ్యటానికి అంగీకరిస్తున్నట్లు పై తీర్మానం తెలిపింది.



రెండు సిండికేట్ల సభ్యులు.



బలాబల నిర్ణయానికి సిద్ధం:

అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ కామరాజ్ శరణు చొచ్చి శ్రీ సంజీవ రెడ్డిగారు ఎన్నికలో వోటమిని తప్పించుకున్నారంటే ఎవరూ కాదనలేరు. ప్రస్తుతం శ్రీయుతులు కామరాజ్, బ్రహ్మానంద రెడ్డి ఇద్దరూ ఢిల్లీలోనే ఉన్నారు. ముఖ్య మంత్రికి రాష్ట్ర కాంగ్రెసులో మెజారిటీ ఉంది. ఆంధ్ర రాష్ట్రంలో రెండవ సిండికేట్ సృష్టించిన శ్రీ సంజీవ రెడ్డి గారితో రాజీ పడవలసిన అవసరం ఆయనకి లేదు. కాంగ్రెసు పార్టీలో ప్రజాస్వామ్య పద్ధతులకి హాని రాకుండా చూసే బాధ్యత మాత్రం పార్టీ అధ్యక్షులు శ్రీ కామరాజ్‌కి ఉంది.

—ఆర్.

# లండన్‌లో చిత్రకళా ప్రదర్శన

లండన్‌లో చిత్రకళా ప్రదర్శన ఏర్పాటు చెయ్యటం ఎంతో కష్టమయిన పని. ఇదీ న్యూయార్క్, పారిస్‌ల వంటి పెద్ద కళా కేంద్రం మహానగరమూ కాబట్టి ప్రపంచంలో ఎక్కడెక్కడి నుంచో కళాకారులు వచ్చి తమ చిత్రాలనీ, శిల్పాలనీ ప్రదర్శించటానికి ప్రయత్నిస్తూ ఉంటారు. వీరి సంఖ్య కొన్నివేలు. కాని, లండన్‌లో ఆర్ట్ గాలరీల సంఖ్య తక్కువ. అందరికీ అవకాశం దొరకటం కష్టం కదా! పేరు గడించిన చిత్రకారుల బొమ్మలు అమ్మడం తేలిక కాబట్టి గాలరీల యజమానులు సాధారణంగా వారి వైపే పక్షపాతం చూపిస్తూ ఉంటారు. బొమ్మల అమ్మకంలో వీరికి కమిషన్ ఉంటుంది కాబట్టి ఇదే వీరికి లాభదాయకం.

ఒక గాలరీ సంపాదిస్తే అతని బొమ్మల ప్రదర్శన మూడువారాల పాటు జరుగుతుంది. ఇక ఆహ్వానపత్రికలు, కాటలాగులు, ఇతర ఖర్చులు, ఆహ్వానితులకి ఏర్పాటు చేసే పానీయాల ఖర్చులు ఇవన్నీ చాలా అయిపోతాయి. అందుకనే గాలరీ సొంతదారులు ఎంతో ఆలోచించికాని ఒక నిర్ణయానికి రారు.

విదేశాలవారు లండన్‌లో తమ చిత్రాలని చూపించాలంటే కొంత ఇబ్బంది పడవలసి వస్తుంది. వారి కీర్తి, పేరుప్రతిష్ఠలు ఎంతో మందికి తెలియవు. అదృష్టం కొద్దీ నా వంటి వారికి కొందరికీ, తమ సామర్థ్యం వల్ల ఇతరులకి కొందరికీ గాలరీలు అందుబాటులో ఉన్నాయి. మాకు ప్రదర్శనలు ఏర్పాటు చేసే ఏజంట్లు ఉన్నారు. కాని కొందరు తమదేశాల రాయబార వర్గాల వారిని ఆశ్రయించి ప్రదర్శనలు ఏర్పాటు చేసుకుంటూ ఉంటారు. గాలరీలు దొరక్కపోతే రాయబారుల కార్యాలయాలలోనే వీటిని ఏర్పాటు చేసుకుంటూ ఉంటారు.. లేదా కొందరు చిత్రకారులు ఉమ్మడిగా కార్పొరేషన్ 'బరో'లలో తమ బొమ్మలని ప్రదర్శించుకుంటూ ఉంటారు.

ఎవరో ఫోన్ చేశారు, "ఫలానా రామారావు ఉన్నాడా?" అని నేను లేనప్పుడు. నాతోబాటే ఒక స్వీడెన్ దేశం మనిషి ఉంటున్నాడు. అతను అడిగిన వారి పేరు, చిరునామా రాసుకున్నాడు. ఆయన పేరు శ్రీ స్వామినాథన్. నేను ఫోన్ చేసినప్పుడు శ్రీ స్వామినాథన్ చెప్పాడు, తను నన్ను గురించి విన్నాడనీ, నా బొమ్మలతో బాటు ఇతరుల బొమ్మలు కొన్నిటిని కూడా ప్రదర్శించటానికి ఇష్టపడుతున్నాడనీ. ఆయన ఉత్సాహం నన్ను ఆకర్షించింది. వెళ్ళి కలిశాను.

ఇక ఆయన్ని గురించి కొంత చెప్తాను. ఆయన ప్రస్తుతం 'మెర్‌మెయిడ్' థియేటర్ మేనేజర్. యువకుడు, ఈ రకం పని ఇంగ్లండులో చేస్తున్న మొదటి భారతీయుడు. అంతేకాక మెర్ మెయిడ్ థియేటర్ చాలా ప్రసిద్ధి పొందినది. కొందరు సుప్రసిద్ధ నటులు దీనిని స్థాపించారు. అప్పటికే శ్రీ స్వామినాథన్ అసిస్టెంట్ స్టేజ్ మేనేజర్‌గా ఉన్నారు. మధ్య కొంతకాలం విండ్సర్‌లోని 'థియేటర్ రాయల్'లో పనిచేసి,, ఇ.ఎమ్. ఫాస్టర్ 'ఎ పాసేజ్ టు ఇండియా' ఆర్. కె. నారాయణ్ 'ది గైడ్' మొదలయిన నాటకాలలో పాత్రధారణ చేశారు కూడా. జర్మన్ ప్రభుత్వం ఆహ్వానం మీద ఆ దేశం వెళ్ళి నాటకరంగాలని అనుశీలించి వచ్చారు.



లండన్‌లోని మెర్మెయిడ్ థియేటర్ మేనేజర్ శ్రీ శామాస్వామినాథన్

అసలు ఆయన పుట్టింది మద్రాసులో. కొన్ని పత్రికలకి ఫొటోగ్రాఫర్‌గా ఉంటూ బ్రిటిష్ కౌన్సిల్‌లో ఉద్యోగం చేసేవారు. ఇంగ్లండ్ నుంచి వచ్చే నాటక బృందాలకి తోడ్పడుతూ ఉండేవారు. కొంతకాలం తర్వాత 'నఫీల్డ్ ఫవుండేషన్' వారి గ్రాంటుతో ఇంగ్లండ్‌కి వచ్చారు. ఇక్కడే ఉంటున్నారు.

మెర్ మెయిడ్ థియేటర్‌లో భారతీయ చిత్రకారుల బొమ్మలు చూపించటం ఇది మొదటిసారి. దానికి ఎంతో ఉత్సాహంతో పూనుకున్నారు. ఎయిర్ ఇండియా ఆఫీసు నుంచి, వివిధ చిత్రకారుల వద్ద నుంచి, చిత్రాలు ఉన్నవారి వద్దనుంచి వీటిని ప్రోగుచేసి ప్రదర్శన ఏర్పాటు చేశారు.

ఇందులో సతీష్, గుజరాల్, హుస్సేన్, రామ్ కుమార్, జామినీరామ్, సంతోష్‌ప్రభ, శ్రీవి



'లేపాక్షి కుడ్య చిత్రం' —చిత్రకారుడు శ్రీ ఎస్. వి. రామారావు



ఎద్దులు
చిత్రకారుడు: శ్రీ ఎం. ఎఫ్. హుస్సేన్

వాసులు, శాంతిదల్ వీరివి కాక నా చిత్రాలు ప్రదర్శించారు. ఇంకా ఇతరుల చిత్రాలు కొన్ని తగిలించారు, రాజపుట్, మొగల్ చిత్రాలు కూడా ప్రదర్శించారు.

ప్రదర్శన ప్రారంభోత్సవం బాగా జరిగింది. గుజరాల్ బొమ్మలు అందంగా ఉంటాయి. అబ్‌స్ట్రాక్ట్ పద్ధతిలో వేస్తాడు ఆయన. నీలం, బూడిద రంగులని పట్టీలు పట్టీలుగా వాడటం ఆయనకి ఇష్టం.

జామినిరాయ్ చిత్రాలు రెండు పెట్టారు. తీర్చిదిద్దిన ముగ్గు లాగా, పసుపు రాసుకున్న ముత్తయిదువులాగా, గంభీరంగా, నిండుకుండ లాగా తొణకకుండా కనిపిస్తాయి ఆయన చిత్రాలు. 'జాలరులు' అనే చిత్రంలో ముగ్గురు జాలరులు (వారు రాజులా?) పడవ మీద వెడుతూ ఉంటారు. నీటిలోని చేపలు కూడా వారితో బాటు పరుగులు తీస్తున్నట్లు చిత్రించారు. కాని ఆయన బొమ్మలలో ఏవీ కదలవు, మెదలవు. విదేశాల వారికి 'అసలయిన' భారతీయ చిత్రాల లాగ కనిపిస్తాయి.

జానపద చిత్రాలు వేసేవారిలో భారతదేశంలో కెల్లా చెప్పుకో దగ్గవారు ఒకరే అని నా అభిప్రాయం. ఆయనే శ్రీ కె. శ్రీనివాసులు గారు. ఆయన 'గడ్డి అమ్మే వాళ్ళు' ఎవరినైనా ఇట్టే ఆకర్షిస్తుంది. అందులో అమాయకంగా, ముగ్ధలుగా, ముతక చీరలలో కనిపించే అమ్మాయిలు మనని వేరుగా పల్లెటూళ్ళలోకి తీసుకువెడతాయి. ఆయన సాధించిన సొగసు, వర్ణమిశ్రమం అద్భుతమైనవి.

ఒరిస్సా నుంచి గోపికా వస్త్రాపహరణ దృశ్య చిత్రం ఒకటి వచ్చింది. ఎవరు వేసిందో తెలియదుకాని అతి మనోహరంగా ఉంది.

హుస్సేన్ సుప్రసిద్ధులు. ఆయన 'కాంపోసిషన్', 'కూతురు', 'పులి', 'ఎద్దులు' మొదలయిన చిత్రాలు ఈ ప్రదర్శనలో చూపించారు. అయినా వీటిలో ఏదో బలహీనత కనిపించింది. నాతో బాటు ప్రదర్శన చూస్తున్న ఒక తెలుగు అమ్మాయి "ఇది పులి బొమ్మా, పిల్లి బొమ్మా?" అన్నది. ఎద్దులు చిత్రం ఎలెక్షన్ పోస్టరు లాగా కనిపించింది. ఎద్దు మీద 'చేతి ముద్ర' అర్థం ఏమిటి?

ఎయిర్ ఇండియా ఆఫీసులో 'ప్రభ' అనే బొంబాయి చిత్రకారిణి వేసిన నీటి రంగు బొమ్మలు కొన్ని ఉంటే తీసుకు వచ్చి ఇక్కడ ప్రదర్శించారు. భారతదేశంలో వివిధ ప్రాంతాల స్త్రీలని చూపించే ఈ బొమ్మలు కాలండర్ బొమ్మల లాగ ఉంటాయి. 'సాగర్' అనే చిత్రకారుని ప్రదర్శన అంశాలు రెండూ బాగున్నాయి. అవి శిల్పాలో, చిత్రాలో చెప్పటం కష్టం. చెక్క బోర్డుకి ఎన్నోరకాల మేకులు వరుసగా గుచ్చి ఉన్నాయి. పెద్ద రేకులని నలిపివేసి వాటిని బోర్డుకి అతికించారు. బోర్డుకి పెద్ద పెద్ద బెజ్జాలు పెట్టి, రంగులు వేశారు. ఎంతో బరువుగా ఉన్న వీటిని గోడకి తగిలించేప్పుడు మాకు ఆయాసం వచ్చింది.

ప్రఫుల్ల మహంతి అనే ఆయన నీటి రంగు చిత్రాలు నాకు నచ్చాయి. వీటిని చూసినప్పుడు నేను అమెరికాలో చూసిన రంగుల టెలివిజన్ గుర్తుకి వచ్చింది.

మొగల్, రాజపుట్ చిత్రాలు చాలా చక్కగా ఉన్నాయి. బూడిదరంగుని, ఇటికె రంగుని మన భారతీయ చిత్రకారులు ఎంత అందంగా చిత్రించేవారో ఇవి చెప్తాయి. వాటిలోని సూక్ష్మ వివర నిర్మాణం వర్ణనాతీతం.

ఇందులో నా బొమ్మలు రెండు ప్రదర్శించారు. అసలు ప్రదర్శన ప్రారంభమే నా చిత్రంతో జరిగింది. ఇది 'లేపాక్షి మ్యూరల్.' దీనిలో లేత ఆకుపచ్చ, పసుపు, నీలం రంగులు ఎక్కువగా వాడాను. పెద్ద పరిమాణాలలో నిర్మించి గోడల మీద బొమ్మలలోని గరుకుతనం తీసుకురావటానికి, ప్రయత్నించాను. అమెరికన్ చిత్రకళా విమర్శకుడు, శ్రీ డేవిడ్ స్టూవర్ట్ దీనిని చూసి, "ప్రదర్శనలో నేను చూసిన వాటన్నిటిలో నచ్చింది రాజపుట్ చిత్రాలు, మీ లేపాక్షి కుడ్య చిత్రం." అన్నారు. బెర్నార్డ్ మెయిర్స్ మరికొందరు నా చిత్రం ముందు నుంచుని ఫొటోలు తీయించుకున్నారు.

కలగాపులగంగా అన్నిరకాల చిత్రకారులకి ఒక చిత్రమయిన అవకాశం కలిగింది. చిత్రకారులయిన మాకూ, చూసేవారికీ, కూడా సంతోషం కలిగింది!

—ఎస్. వి. రామారావు



జాలరులు —చిత్రకారుడు : జామిని రాయ్



# అజ్ఞాతవ్యక్తి

శ్రీ బి. వి. నరసింహారావు

హఠాత్తుగా వెనుక నుంచి కారు హారన్ వినిపించేసరికి ఖంగారుగా పక్కకు తప్పుకో బోయి వెనక్కుతిరిగాను. ఆ కారు నా పక్కగా వచ్చి ఆగిపోయింది. డ్రైవరు సీటులో వున్న 'ఖరీదైన మనిషి' "నమస్కారం మాస్టారూ" అని చిరునవ్వు నవ్వాడు.

ఒక్కనిముషం నాకంతా అయోమయమయింది. నాలాంటివాడికి అటువంటి గొప్ప వ్యక్తులు తారస పడరు. నా ఆలోచనలకు వ్యవధి నివ్వకుండా ఆ కారులోని ఆసామి కిందకు దిగి "నన్ను గుర్తు పట్టలేదా మాస్టారూ!" అన్నాడు నమస్కరిస్తూ.

అతను బాగా పొడుగ్గా వున్నాడు. నల్లటి సూటు, నల్లటి అద్దాల కళ్లజోడు, తల మీద మార్వాడీలు పెట్టుకునే టోపీ—వీటన్నింటితో చాలా దర్జాగా కన్పిస్తున్న అతనెవరై వుంటాడో నాకు తోచలేదు. నా దగ్గర చదువుకున్న వాళ్లంతా నాకు బాగా గుర్తు లేకపోయినా కానీ, గుర్తున్న కొంత మందిలోనూ, ఎవరూ ఇతనంత ఉన్నతంగా లేరు.

ఆప్యాయంగా పలకరించిన అతనికి, "నువ్వెవరో నాకు జ్ఞాపకం లేదు" అని చెప్ప [illegible] అతని వేపు చూస్తుండి పోయాను. అతనిని గుర్తు పట్టడానికి ప్రయత్నిస్తూ.

"నేనెవరైందీ తర్వాత చెప్తాను కానీ, ముందు కారులోకి రండి మాస్టారూ" అతను కారు వెనుక సీటు తలుపు తీసి అన్నాడు.

ఆ మాట తీరు ఎప్పుడో, ఎక్కడో విన్నదిలానే వుంది. అయినా అతనింకా గుర్తు రావటంలేదు.

"రండి మాస్టారూ" అతను బలవంతం చేశాడు. అతను అలా బలవంతం చేస్తూంటే నా కెందుకో అర్థంలేని వూహ ఒకటొచ్చింది. ఎక్కడో ఒక బ్యాంకు దగ్గర ఎవరో డబ్బు తీసుకు వెళ్తూ వుంటే, ఎవరో బలవంతం చేసి కారులో ఎక్కించుకు వెళ్లి ఆ డబ్బు కాజేశారని అమధ్య పత్రికలలో వచ్చిన వార్త ఒకటి గుర్తొచ్చింది. ఇతనూ అంతే.. నా వూహకు నాకే నవ్వొచ్చింది. మానవులకు అనుమానం ఎక్కువేమో. లేకపోతే [illegible]తో సంసార సాగరాన్ని ఈదలేక ఈదుతున్న బడిపంతుల్ని నేను. అలాంటి నా దగ్గర డబ్బు వుంటుందని, కనీసం అనుమానించడానికైనా ఇతరులకు అవకాశం ఎలా వుంటుందా అన్న ఆలోచనైనా నాకు రాలేదు. [illegible] ఆప్యాయంగా పలకరిస్తూ వుంటే అతనిని అనుమానించాలన్న వూహ అసలు నాకెలా వచ్చిందా అని.

అతను తిరిగి బలవంతం చేయడంతో నా పిచ్చిపిచ్చి వూహలను కట్టిపెట్టి కారు వెనుక సీటులో కూర్చున్నాను. కారులో కూర్చోవడం నా జీవితంలో బహుశా అదే మొదటిసారి అనుకుంటాను. చాలా కొత్తగా వుంది. చేతిలో సరుకులతో వున్న సంచీని పదిలంగా ఒళ్లో పెట్టుకున్నాను. అతను నా వైపు చూచి, చిరునవ్వు నవ్వి, కారు తలుపు గట్టిగా వేసి, డ్రైవరు సీటులోకి వెళ్లాడు.

అతని వేపు ఓసారి చూశాను. అతను చాలా గంభీరంగా వున్నట్లుగా కన్పించాడు. కారు బయలుదేరింది. కొద్దిక్షణాలు గడిచిన తర్వాత అతను వెనక్కు తిరక్కుండానే అన్నాడు.

"మీరు చాలా పెద్దవారై పోయారు మాస్టారూ." ఆ గొంతులో ఏదో తెలియని మమకారం, ఆప్యాయత ధ్వనించింది. ఎందుకో గాని ఆ ఆప్యాయతకు తట్టుకోలేకపోయాను. అతను అలా ఆప్యాయంగా మాట్లాడడం కూడా నాకు ఒక రకంగా బాధగానే వుంది. అతన్ని గుర్తు పట్టలేకపోతున్నా. అతనన్న మాటకు నేనేమీ మాట్లాడలేదు.

"అమ్మగారు కులాసాగా వున్నారా? రామం ఏం చేస్తున్నాడు? కాత్యాయినికి పెళ్లి అయింది కదూ. వాళ్లెక్కడ వుంటున్నారు?" అతను ప్రశ్నల వర్షం కురిపించాడు.

ఈ ప్రశ్నలన్నింటిలోకీ, 'అమ్మగారు' అనే మాట వినేసరికి నాకు ఒళ్లు ఝల్లు మనిపించింది. ఏదో గుర్తుకొచ్చినట్లే అనిపించి ఇట్టే మాయమయింది. అతనిని పరిశీలనగా చూడబోయాను, కాని అతను కనీసం పక్కకన్నా తిరగనందు వల్ల అతని మొహం నాకు కనిపించలేదు.

అతను అడిగిన ప్రశ్నలకు జవాబివ్వకపోతే నొచ్చుకుంటాడని అన్నింటికీ సమాధానాలు వివరంగా చెప్పాను.

"అయితే ఇక్కడ మీరు, అమ్మగారు మాత్రమే వుంటున్నారన్నమాట" నా సమాధానాలు విని అతను అన్నాడు.

"అవున్నాయనా" అన్నాను.

తర్వాత అతనేమీ మాట్లాడలేదు. కారు వేగం హెచ్చింది. ఆ వూళ్లో గొప్ప వాళ్లుండేచోటు దాటి వూరికి చివరగా వున్న ఒక

పెద్ద మేడ దగ్గరకు కారు వెళ్ళింది.. కారును చూడగానే గేటు దగ్గరి గూర్ఖా 'సెల్యూట్' చేసి గేటు తీశాడు. పూల మొక్కలు, క్రోటను మొక్కల మధ్యగా, మెల్లిగా వెళ్ళి కారు పోర్టికోలో ఆగింది. కారు ఆగీ ఆగగానే ఇద్దరు నౌకర్లు పరుగెత్తుకుంటూ వచ్చి అతని ప్రక్కన తలుపు తీసి నిలబడ్డారు. అతను వచ్చి నా ప్రక్క తలుపు తీసి

"రండి మాస్టారూ" అన్నాడు.

ఒక్కక్షణంలో నా అంతస్తు కొన్ని రెట్లు పెరిగినట్లయి కొంచెం సిగ్గు పడ్డాను.

"ఆ సంచీ ఇలా ఇవ్వండి" అని అతను నా చేతి సంచీ తీసుకుని ప్రక్కన వున్న నౌకరుకు అందించి, నా చేయి పట్టుకుని మెల్లిగా కారులోంచి దింపాడు.

"నేనింకా గుర్తుకు రాలేదు కదండి. నేను...నేను..లక్ష్మీపతిని."

'లక్ష్మీపతి' ఆ పేరు వినేసరికి నాకు ఆశ్చర్యం, నవ్వూ రెండూ వచ్చాయి. అతనిని ఈసారి బాగా పరిశీలనగా చూశాను. ఏవేవో ఆలోచనలు నా మెదడును అప్పుడే ఆక్రమించేశాయి.. లక్ష్మీపతి.. అని రెండుసార్లు కొంచెం బిగ్గరగానే అనుకున్నాను.

అతను మెల్లిగా నవ్వి, "రండి" అని హాల్లోకి దారి తీశాడు.

* * *

"నన్ను అందరూ మోసం చేశారు మాస్టారూ! నేనంటే జాలీ, దయ ఎవ్వరికీ లేవు. ప్రతీవారు నన్ను ఒక పురుగును చూచినట్లు చూచేవారు.. అందుకే చచ్చిపోదామనుకున్నాను. కానీ మీరు అందుకు కూడా వీలు లేకుండా చేశారు. మీకేం ద్రోహం చేశానని నన్ను బతికించారు మాస్టారూ" మాసి, చినిగి, వాసన గొడుతున్న చొక్కాతో కళ్ళనీళ్ళు తుడుచుకుంటూన్న ఒక కుర్రవాడి విగ్రహం కళ్ళ ముందు మెదిలింది. ఆ కుర్రవాడి పేరు కూడా లక్ష్మీపతే. 'లక్ష్మీపతి' అనే పేరు వినేసరికి నా మనస్సు వలభై సంవత్సరాల క్రిందకు పోయి ఆ కుర్రవాడిని గుర్తు చేసింది. అంత దీనావస్థలో వున్న ఆ కుర్రవాడి పేరు 'లక్ష్మీపతి' అని తెలుసుకునేసరికి నాకెందుకో నవ్వొచ్చింది. అప్పటినుంచీ 'లక్ష్మీపతి' అనే పేరు ఎప్పుడైనా వినడం తటస్థిస్తే నాకు నవ్వొస్తుండేది.

ఆ నాటి ఆ కుర్రవాడి విగ్రహం కన్నుల యెదుట స్పష్టంగా నిలిచింది. కుర్రవాడంటే అతను బొత్తిగా పసివాడు కాదు. అతనికి దాదాపు పద్దెనిమిది, పంతొమ్మిది సంవత్సరాలు వుండొచ్చు. లోతుకు పీక్కుపోయి గాజు గోళాల్లా వున్న కళ్ళు, పొడుగాటి ముక్కు, తైల సంస్కారం లేక వాసన గొడుతూ, అట్టలుగా వున్న జుట్టు, మాసి చినిగిపోయిన చొక్కా, అటువంటి దశలోనే వున్న నిక్కరూ—వీటన్నింటినీ జత గూర్చి ప్రాణం పోస్తే కదిలే విగ్రహమే ఆ కుర్రవాడు లక్ష్మీపతి.

"..ఇల్లూ, వాకిలీ, తల్లీ, తండ్రులూ—నా కెవరూ లేరు మాస్టారూ! నేను ఒంటరిగాణ్ణి.. అన్నీ సరిగ్గా వుంటే ఎందుకు చావాలనుకుంటాను?" బహుశా చాలారోజుల తర్వాత తొలిసారిగా నవ్విన పేలవమైన నవ్వులోంచి, నా ప్రశ్నలకు సమాధానంగా, ఆ కుర్రాడు జవాబిచ్చాడు.

నేను కూడా అతనిని అంతగా ప్రశ్నించలేదు. మనుష్యుల పేర్లు, పెరిగే కొద్దీ వాళ్ళ తయారయ్యే తీరు ఈ రెండింటి మధ్య సర్వసాధారణంగా వుండే వ్యత్యాసాన్ని గమనిస్తుండే తత్వం నాది. అందుకనే అంతటి నిర్భాగ్య స్థితిలో వున్న అతని పేరు 'లక్ష్మీపతి' అని వినేసరికి నాకు నవ్వొచ్చింది. ప్రతివాడికీ పాతికేళ్ళు వచ్చిన తర్వాత వాడి తరహా గమనించి, అందుకు తగ్గట్లుగా మరోకసారి 'నామకరణం' చేస్తే బాగుంటుందేమో? నా ఈ వూహ చాలామందికి నవ్వు కల్గించవచ్చు. అలా కలిగించింది కూడాను.

* * *

"రండి మాస్టారూ. ఏమిటి ఆలోచిస్తున్నారు?" అతను హాలులోకి ప్రవేశిస్తున్నప్పుడు నన్ను హెచ్చరించాడు. అతని హెచ్చరింపులో మళ్ళీ ఈ లోకంలోకి వచ్చాను.

"అబ్బే..ఏంలేదు.. ఏంలేదు" సమాధానంగా అన్నాను. నా చేతిని పట్టుకుని అతను నన్ను జాగ్రత్తగా నడిపిస్తున్నాడు. ఆ హాలు నా కంటికి దేవేంద్ర భవనంలా కన్పించింది. విశాలంగా, చాలా కళాత్మంగా రూపొందించబడిన ఆ హాలులో పెద్ద పెద్ద సోఫాలు, ముచ్చట గొలిపే ఖరీదైన చిన్న టేబుళ్ళు, ఆ టేబుళ్ళ మీద అందమైన డిజైన్లు గల 'క్లాత్'లు ఫ్లవర్‌వాజులలో వసివాడని రంగురంగుల పువ్వులు పొందికగా అమర్చి వున్నాయి. నేను చూచిన ఏ సినిమాలో కూడా అంతటి అందమైన హాలు దృశ్యంలేదు. ఎవరీ లక్ష్మీపతి?!.. సార్థకనామధేయుడిలా వున్నాడు. అతని వేపు ఓసారి చూచాను. అదే సమయంలో అతనూ నావేపు చూచి చిన్నగా నవ్వాడు.

హాల్లో పరిచి వున్న ఆ మెత్తటి తివాసీకి నా పాదాల దుమ్ము ఎక్కడ అంటుకుంటుందోనని అతి తేలికగా, జాగ్రత్తగా, అడుగులు వేస్తున్నాను. మళ్ళీ నా మనస్సు గతంలోకి జారిపోయింది..

* * *

ఆ రోజు.. నాకు మరుపురాని రోజు.. ఆ రోజున కూడా చెప్పులు లేని పాదాలకు రైలు కట్ట వెంబడి వున్న రాళ్ళు ఎక్కడ గుచ్చుకుంటాయోనని ఈ రోజులాగే అతి తేలికగా, జాగ్రత్తగా నడిచాను. ఆ నాటి వరకూ నా జీవితంలో చెప్పుకోదగినంత పెద్ద సంఘటనేమీ జరగలేదు. ఆ రోజు, ఆ సంఘటన తర్వాత మళ్ళీ ఈ నాటి వరకూ ప్రత్యేకించి గుర్తుంచుకునే విశేషమేమీ జరుగలేదు కనుక ఆ రోజు, నాకు బాగా గుర్తుండిపోయింది.

ప్రతిరోజూ రైలు కట్ట వెంబడి కొంత దూరం 'షికారుగా' వెళ్ళడం నా కప్పట్లో ఒక అలవాటుగా వుండేది. ఆ రోజూ అలాగే వెళ్ళాను. అలా 'ఔటర్ సిగ్నల్' దాటి రెండు ఫర్లాంగులు నడిచి అక్కడ అనువుగా వుండే స్థలం చూచుకుని పొద్దుగూకిందాకా కూర్చున్నాను. రైతులు కొందరు అవిశాకు మోపులు కట్టుకుని వెళ్తున్నారు. దాదాపు ప్రతిరోజూ వాళ్ళు అలా వెళ్ళిన కొద్దిసేపటికి నేను ఇంటి ముఖం పట్టడం అలవాటు. అయితే ఆ రోజు మాత్రం నేను మరికొంత సేపు అలాగే కూర్చుండిపోయాను. ఆ వూరు అంత పెద్ద 'టౌను' కాదు. అలాగని పల్లె కూడాకాదు. ఇంకా చీకటి పడితే వెళ్ళడం కష్టమని బద్ధకంగానే లేచాను. మనస్సులోకి ఏవేవో ఆలోచనలు వస్తున్నాయి, పోతున్నాయి.

ఉన్నట్టుండి నా పాదం ఒక కంకర రాయి గాఢంగా కౌగలించుకున్నంత పని చేశాయి. దెబ్బేమీ తగల్లేదు కాని, ఈ సారి ఇంకా జాగ్రత్తగా నడువసాగాను. నాకు ముందున్న 'సిగ్నల్' రైలును ఆహ్వానిస్తున్నట్లుగా వంగింది. అప్పటివరకూ తిరుగులేనట్లుగా, ధీమాగా వెలుగుతున్న ఎర్రదీపం, ఆకుపచ్చ దీపానికి చోటిచ్చి తాను తప్పుకుంది. ఒకసారి వెనక్కి తిరిగిచూచాను. సాయంత్రమే రావలసిన రైలేదో లేటుగా వస్తే తప్ప ఆ వేళప్పుడు బండ్లేమీ లేవు.

నాకు వెనుక కొంచెం దూరంలో ఎవరో వ్యక్తి కొంచెం వేగంగానే రైలు

ఇట్టవేపు వస్తున్నాడు. నేను మొదట అతనిని పట్టించుకో లేదు. ముందు జాగ్రత్త కోసం నేను రైలు కట్ట దిగి కొంచెం పక్కగా, మెల్లిగా నడుస్తున్నాను. అనుకోకుండానే నేను ఓ సారి వెనక్కి తిరిగి చూచాను. ఆసరికే అతను రైలు పట్టాల మధ్య నిల్చుని వున్నాడు. తర్వాత నిశ్చింతగా అతను నిల్చున్న చోటనే కూర్చు న్నాడు. అతని ప్రవర్తన కొంచెం వింతగా కన్పించడంతో నేను అతనికి సాధ్యమైనంత దగ్గరకు వెళ్ళాలని మళ్ళీ వెనక్కి తిరిగి వెళ్ళాను.

దూరాన పొగ కనిపించింది. మిణుకు మిణుకు మనే వెల్తురు తనను తానే రైలు ఇంజనుగా పరిచయం చేసుకుంది. రైలు పట్టాల మీద కూర్చుని ఉన్న వ్యక్తి ఈసారి ఒక పట్టాను తలగడగా చేసు కుని పడుకుని వున్నాడు. నా గుండె ఒక్కసారి కొట్టుకోవడం మానేసి కొద్ది క్షణాల తర్వాత తిరిగి పని చేసినట్టయింది. అతను..... అతను...... ఆత్మ.... హత్య.... ఆక్షణంలో నామెదడు అంతకు మించి పని చేయలేదు. రైలు శబ్దం రాను రాను దగ్గరగా విన్పిస్తోంది. నేను త్వరగా అతని వేపు పరుగెత్తాను. ఆ ప్రయత్నంలో నా కాలికి ఒక రాయి బలంగా కొట్టుకుంది. అతను మాత్రం అటువేపు తిరిగి నిశ్చిం తగా, నిర్విచారంగా పడుకుని వున్నట్లుగా నాకు కన్పించాడు.

రైలు శబ్దం బాగా దగ్గరవుతోంది. నేను ఒక్క పరుగున అతనిని సమీపించ డమూ — అతనితో సహా రైలు కట్ట కింద వున్న పొదమీద పడిపోవడమూ— రైలు మమ్మల్ని దాటి పోవడమూ— రెప్ప పాటులో జరిగి పోయాయి.

# లక్ష్మీపతి

కొద్ది క్షణాల వరకు మేము ఆ పొద మీద అలానే వుండి పోయాము.... తర్వాత మెల్లగా లేచాను. చేతులు, మోచేతులు, కాళ్ళు, అన్నీ బాగా గీరుకు పోయాయి. రాయి కొట్టుకున్న కాలివేలి నుండి రక్తం కారుతోంది. అతని వేపు చూచాను. అతను కూడా లేవడానికి ప్రయత్నిస్తున్నాడు. అతనికి కూడా ఒళ్ళంతా బాగా గీరుకు పోయింది. కొంచెం ముందుకు వంగి పరీక్షగా అతని మొహంలోకి చూచాను. అతను యువకుడే. ఆ చీకట్లో అంతకు మించి అతనిని నిశితంగా చూడలేక పోయాను. అతను లేస్తూ కొంచెం పెద్దగా మూలిగాడు. ఆ స్వరాన్ని నేను ఇంతకు ముందెప్పుడు వినలేదు.

అతన్ని మెల్లగా లేవ దీశాను. అతను ప్రతిఘటించ లేదు. లోతుకు పీక్కు పోయిన కళ్ళతో అతను నన్ను ఒక్క మారు తీవ్రంగా చూశాడని మాత్రం చెప్పగలను. ఇద్దరమూ లేచి నిలబడ్డాము.

"నాతోరా...." అంతకు మించి నేను ఆ సమయంలో ఏమీ మాట్లాడలేదు. అతనూ మాట్లాడ లేదు. దారిలో అతని వైపు పరిశీలనగా చూచాను. అతనెవరో.... అతనికి నుదుటి మీద మాత్రం బాగా పెద్ద దెబ్బే తగిలింది. అగాయం మానిన తర్వాత అతని నుదుటి మీద— క్రాపు లోకి— మచ్చ ఏర్పడిపోయింది. — అతని పేరే లక్ష్మీపతి—

— ఆరోజున ఇంత సేపు జరిగిన సంఘటన ఈ రోజు నాకళ్ళ ముందు కొన్ని క్షణాలలో కదిలి పోయింది.

"మాస్టారూ! ఏమిటి ఇందాకటి నుంచి అంత తీవ్రంగా ఆలోచిస్తున్నారు?... రండి.... ఈ సోఫాలో కూర్చోండి.... ఇప్పుడే వస్తాను." లక్ష్మీపతి చాలా తూచి తూచి మాట్లాడు తున్నాడా అని పించింది. అతను తనను గురించి ఏమీ చెప్పడేమిటి?

సోఫాలో పడివున్న ఒక మేగజైను తీశాను. అందులో దీనంగా వున్న ఒక కుర్రవాడి బొమ్మ కనుపించింది. నాకు మళ్ళీ లక్ష్మీపతి జ్ఞాపకం వచ్చాడు.

* * *

అందరికి లాగానే ఆ లక్ష్మీపతికీ ఓ కథ వుంది. ఆ రాత్రి మే మిద్దరమూ మా గాయాలకు ప్రథమ చికిత్సలాంటిది చేసుకుని, కాస్త ఎంగిలి పడి లేచాము. రోడ్లో మళ్ళె పందిలికి కాస్త ఎడంగా మంచాలు వేసుకుని పడుకున్నాం మే మిద్దరం. అతనిని ఎన్నో ప్రశ్నలు వేశాను. అతను మాత్రం కొన్నింటికి, కొన్ని జవా బులిచ్చాడు. అతని సమాధానాల తీరు గమనించిన మీదట అతనికి అభిమానం కొంచెం ఎక్కువగానే వున్నట్లు కన్పిం చింది.

కొడుకు ఎలాగైనా సంపాదించుకో గలడన్న వూహతో లక్ష్మీపతి తల్లి కూతు రును ప్రేమగా చూచేది. తండ్రి ప్రేమ ఎలాంటిదో తెలియని లక్ష్మీపతికి తల్లి ప్రేమ అలా దూరమయింది. లక్ష్మీపతిని ఆదరణగా ఎవరూ చూడలేదు — ఆఖరికి అతని అక్కయ్య కూడా. తల్లి మర ణించిన తర్వాత లక్ష్మీపతి దిక్కులేని వాడయ్యాడు. బావగా రింట్లో జీతం బత్తెం లేని నౌకరుగా వుండలేక అభి మానంతో, ఆశలతో ఇవతలికి వచ్చేసిన అతనిని ఎవరూ చేరదీయ లేదు. పని చేసిన కొన్ని చోట్ల అతనిని బాగా హింసిం చారు— అవమానించారు— లేని పోని దొంగతనాలు మోపారు— ఆఖరుకు అతనికి ఈ లోకంలో వుండడానికి— బతికేందుకు కాస్తంత జాగా అయినా కన్పించక ఆత్మ హత్య చేసుకోబోయాడు— ఇదీ ఆ కుర్రవాడి కథ. ఎన్నో ప్రశ్నలు వేస్తేనేగాని, అతని కథ నాకు తెలియ లేదు. ఈ కథలో 'నిజమెంత' అనే అనుమానాన్ని నాదగ్గరకు రానివ్వలేదు.

ఆ రోజు నుంచి అతను మాయింట్లోనే వున్నాడు. అలా వుండమన్నాను.

"బతక లేని వాళ్ళు ఈలోకంలో

(46 వ పేజీ చూడండి)



# రేపటి పెయింట్ యీ రోజే అందుతోంది, మీకు!

## డ్యూలక్స్ న్యూ అక్రిలిక్ ప్లాస్టిక్ ఎమల్షన్

ఇండియాలో తొలిసారిగా
లభిస్తున్న కొత్త ఫార్ములా
కోపోలిమర్ డెకొరేటివ్ పెయింట్

DULUX
ACRYLIC EMULSION
ICI
MADE IN INDIA
THE ALKALI & CHEMICAL CORPORATION OF INDIA LTD

సంప్రదాయబద్ధమైన ప్లాస్టిక్ ఎమల్షన్ పెయింట్లలో విశేషమైన ప్రగతి।

- ఎంతో మన్నికైనది — వెలుపల వుపయోగించినా అక్రిలిక్ కోపోలిమర్ చిరకాలం మన్నుతుంది.
- ఎంతో లాభసాటి—ఎక్కువ ప్రదేశంపై వేయటానికి వీలవుతూ, ఒకే స్థాయిలో వుండే నునుపైన రంగు నిస్తుంది.
- ఎంతో దృఢమైనది—మళ్లీ మళ్లీ కడిగినా, పగుళ్లివ్వటంగాని, కళావిహీనం గావటంగాని జరుగదు.

ఐసిఐవారి విశేషమైన పరిశోధనతో
ఇండియాకు లభించిన ప్రత్యేకమైన వుత్పత్తి।

తయారుచేయువారు :
ది ఆల్కలీ & కెమికల్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా లిడ్
పూర్తి విక్రయదారులు :
ఐసిఐ (ఇండియా) ప్రైవేట్ లిడి.
కలకత్తా బొంబాయి ఢిల్లీ మదరాసు.




IGC 572 TEL




### జరిగిన కథ

సుదర్శనానికి వైద్యం చేయడానికి అయిష్టాన్ని ప్రదర్శించిన డాక్టర్ హరీష్‌ను ఒప్పిస్తుంది మంజుల. హరీష్ తల్లి మంజుల పుట్టినరోజు కానుకగా నిర్మల్ పెయింటింగ్ ప్రెజెంట్ చేస్తుంది. హరీష్, మంజుల పరిచయాన్నిచూసి అసూయపడ్తాడు శంకరం. గోపాలం సుదర్శనం గురించి చెప్పిందంతా విన్నతర్వాత ఆయనపై అసహ్యం కల్గినా తన ధర్మాన్ని నిర్వర్తించడానికే నిశ్చయించుకుంటాడు హరీష్. శంకరం వేరొక యువతితో ప్రేమకలాపాలు జరుపుతూ ఆస్తికోసం మంజులను వివాహం చేసుకోడానికి వేసిన పథకాన్ని విన్న హరీష్ మంజులలు ఆశ్చర్యచకితులవుతారు. తాను చిన్నప్పట్నుంచి ఎదుర్కొంటున్న పరిస్థితులు అన్నిటినీ హరీష్‌తో చెప్తుంది మంజుల.

---

## 6

ఆవిడ భయపడినట్లే తరువాత ఆరు నెలలకే ఆవిడ పోయింది. అప్పుడునాన్నగారు వస్తారేమో, ఆయన అడిగినా అడగకపోయినా నా అంతట నేనే ఆయనతో వెళ్లిపోదామనుకున్నాను. కాని ఆయన రాలేదు. 'సంగతి విని చాల విచారించాము' అంటూ మామయ్య పేర ఓ కార్డు మాత్రం రాశారు. ఇక అలాంటప్పుడు, చదివే చదువు మధ్యలో ఆపేసి ఆయన దగ్గరికి వెళ్లిపోవాలని నాకూ అనిపించలేదు. ఆత్మీయత అనేది లేని దగ్గరికి అభిమానం చంపుకుని వెళ్లలేక పోయాను.

అమ్మమ్మ తాతయ్యా ... అత్తయ్యకి నా మీద ఓ విధమైన అధికారం లాంటిది సంక్రమించింది. అయినా, నేను దేనికీ ఆవిడ మీద ఆధారపడి వుండకపోవడంతో కొద్దిగా జంకుతుండేది.

ఆ వేసంగులలోనే నా పెళ్లి చేసేయాలని అత్తయ్య ప్రతిపాదించింది. మామయ్య బలపరిచాడు. నన్నడిగితే అప్పుడప్పుడే చేసుకోనని చెప్పేశాను. అయినా వినక నాన్నగారికి వుత్తరం వ్రాయించింది అత్తయ్య.

నా కిష్టమైతే ఆయన కేమీ అభ్యంతరం లేదని వ్రాశారు. ఆ ఉత్తరం చూస్తూనే నేను అత్తయ్యతో పోట్లాడి ఇలా తొందర పెట్టేటట్లయితే నేను ఇంకెక్కడికయినా వెళ్లి చదువుకుంటానని గట్టిగా చెప్పేశాను. ఆ ప్రయత్నాలు వేశాను కూడ. ఇంక మరెప్పుడూ ఆ ప్రస్తావన తీసుకురానని, నన్ను ఎక్కడికీ వెళ్లిపోవద్దని బతిమాలుకున్నాడు మామయ్య. అన్నట్లుగానే ఈ మూడు సంవత్సరాలూ ఆ గొడవ మళ్లీ తలెత్తలేదు. మధ్య మధ్య బావ మోటు హాస్యాలు చేసినా నేనూ తగినట్లే సమాధానాలు చెప్పేదాన్ని. మేమేదో సరసాలాడుకుంటున్నామని అత్తయ్య మురిసిపోయేది. కాని మామయ్య లోనే ఏదో మార్పు వస్తున్నట్లు నేను కని పెట్టాను. బావ నాతో చనువుగా వుండటం అతనికి మునుపటిలా ఇష్టం గావటంలేదు. అవకాశం వచ్చినప్పుడల్లా 'ఆడపిల్లతో ఏమిటా వేళాకోళాలు' అని మందలించేవాడు. నన్ను బావకిచ్చి పెళ్లి చేయాలనే ఉద్దేశ్యం కూడ అతను మార్చుకున్నాడని నేనే మధ్యే గ్రహించాను. బహుశ బావ బయటి ప్రవర్తన, స్నేహాలు మామయ్య చెవిని పడి వుండొచ్చు. ఇంక అతనిని బాగు చేసే అవకాశం ఎలాగూ లేదనుకొని, నా జీవితం కూడ నాశనం చేయడం ఎందుకనుకున్నాడేమో అప్పట్లో అంతగా పట్టించుకోలేదు గాని, దాని విషయమయే అత్తయ్యకీ మామయ్యకీ ఘర్షణ జరుగుతుండేదని ఇప్పుడనుకుంటున్నాను.

సరే. నిన్నటితో పరీక్షలయిపోయాయిగా. ఇవాళ ప్రొద్దున్నే అత్తయ్య వారం వర్జ్యం అన్నీ చూసుకుని నన్ను కబుర్లలో పెట్టింది.

"బి. ఏ., అయిపోయిందిగా. ఇంక తరువాత ఏం చేస్తావు మంజూ." అంది ఎంతో ప్రేమగా.

"ఏదీ. ఇంకా రిజల్ట్సు రాందేనా?" అన్నాను నేను.

"ఆ. అవే వస్తాయిలే. నువ్వెలాగూ ప్యాసవుతావు. ఇదేదో పూర్తవాలనే ఇన్నాళ్లూ నేనూ నిన్ను అడగలేదు. ఇప్పుడు నీకు ఎలాంటి అభ్యంతరం వుండదనుకుంటా. మీ మామయ్య అలా మంచం మీదనైనా ఉండగా ఆ శుభకార్యం కాస్తా జరిగిపోతే చూచి ఆయన సంతోషిస్తారు." అంది.

నేనేం మాట్లాడలేదు.

"చదువుకున్న పిల్లవి నువ్వు కూడ అలా సిగ్గుపడితే ఎలా? నీ ఉద్దేశ్యం చెప్తే మీ నాన్నగారికి కూడ ఉత్తరం వ్రాసి ముహూర్తం పెట్టేస్తాం." అంది ఎంతో అభిమానం ఒలకబోస్తూ.

ఇంక మౌనంగా వుండి లాభంలేదనుకున్నా. "నాకీ పెళ్లి ఇష్టం లేదత్తయ్యా." అనేశాను.

తెల్లబోయినట్లు ఒక్కక్షణం నా మొఖంలోకి చూసి, "ఏం. ఎందుకు ఇష్టం లేదు." అంది. గొంతు సరళంగానే వుంది.

"ఇష్టం లేదంతే. దానికి ఫలానా కారణం అని లేదు." అన్నా విసుగ్గా.

"చదువులో నీ కంటె కాస్త వెనకపడ్డాడనుకో. అయినా వాడికీ ఈ ఏటితో బి. ఏ., అయిపోతుందిగా. చిన్నప్పటి నుంచి అనుకుంటున్న సంబంధం, ఉన్నట్లుండి నువ్వు ఇష్టంలేదని చెప్తే ఎలా? మాకు మాత్రం ఇంకెవరున్నారు.."అంటూ సాగుతున్న ఆవిడ ధోరణిని ఆపడానికి "ఆలోచించి చెప్తాలే." అన్నా.

అంతలోనే సాయంత్రం అనుకోకుండా ఇంకో సంఘటన జరిగింది.

ఆ నాడు మీ అమ్మగా రిచ్చిన బహుమతి చూసి ఏమిటని అడిగాడు బావ. నిజం చెప్తే ఏం గొడవ వస్తుందోనని మాస్నేహితు రిచ్చారు అన్నా.. ఇందులో మీరంత నొచ్చుకో వలసిందేం లేదు.. అప్పటికి అలా తోచింది చెప్పేశానంతే. బావ నమ్మేశాడు. కాని సాయంత్రం బజారుకి వెళ్లినప్పుడు అను కోకుండా ఆపెయింటింగ్ వివరాలు దొరక డంతో అది మీరే నాకు ఇచ్చారని తెలుసు కున్నాడు. వెంటనే ఇంటికి వచ్చి పెద్ద గొడవ చేశాడు. ఇంతలో అత్తయ్య వచ్చి..'' అంతలోనే మంజుల కంఠం మృదువుగా మారిపోయింది. కళ్లు అపూర్వమైనకాంతితో మెరవసాగాయి. ఆ కాంతి భరించ లేనట్లు హరీష్ చటుక్కున మొహం ప్రక్కకు తిప్పేసుకున్నాడు. అప్పటికే సిగ్గుతో మొహం కాస్త ప్రక్కకి తిప్పుకున్న మంజుల అది గమనించకుండా, ''అత్తయ్య అంది, నేను బావని నిరాకరించడానికి కార ణం...''

ఆ వాక్యం పూర్తి చెయ్యనివ్వకుండా, ''అదంతా నేను విన్నాను.'' అన్నాడు హరీష్.

మంజుల కళ్లు లజ్జాభారంతో వాలి పోయాయి. హృదయాన్ని గిలిగింతలు పెడుతున్న మధురానుభూతిలో చెక్కిళ్లు ఎరుపెక్కాయి. పరవళ్లు తొక్కుతున్న ఆనంద తరంగాల తాకిడికి అధరాలు కొద్దిగా కంపిస్తూండగా, ''విన్నారా?'' అంది.

హరీష్ సమాధానం చెప్పలేదు. కొద్దిగా కళ్లు ఎత్తి కొంటెగా అతని వేపు చూడ బోయిన మంజుల హృదయం కలుక్కు మంది. అతని మొహంలో తనాశించిన భావం లీలా మాత్రంగా కూడ లేదు. నిర్లిప్తంగా దిగంతాల కేసి దృష్టినిలిపి చలన రహి తంగా కూర్చుండి పోయాడు. మంజుల, బాధతో అవమానంతో కృంగిపోయింది.

''నేనంటే ఇష్టం లేదా? ఇంకెవరికైనా మనసిచ్చారా? మరి ఇన్నాళ్లూ నాతో ఎందు కింత చనువుగా వున్నట్లు? వారి అభి మానాన్ని నేనే అపార్థం చేసుకున్నానా?'' అనేక విధాలుగా ఆలోచిస్తున్న మంజుల, అంతలోనే ఏదో స్ఫురించి,

''మాఅత్తయ్య మాటలవల్ల, నావివాహం చిన్నప్పుడే స్థిరపడిపోయిందనీ, ఇపుడు అందుకు వ్యతిరేకంగా జరిగితే అందరూ బాధపడతారనీ అనుకుని వుంటారు. బహుశ ఆ విషయం చెప్పడానికే నన్ను కారులో ఎక్కించుకున్నారేమో. అయినా బావ సంభా షణ, నేను చెప్పిన కథ విన్న తరువాత కూడ...''

''మీ పరిస్థితి అర్థం చేసుకున్నాను. మీరంటే జాలీ సానుభూతి వున్నాయి, అంత కన్నా అదృష్టం నాకు లేదు. నా హృదయ మంతా ఆక్రమించుకున్న స్త్రీ తనంత



తానుగా తన ప్రేమని వ్యక్తం చేసినా అందుకో లేకపోతున్న దౌర్భాగ్యుడిని.'' అన్నాడు బాధగా.

''అంటే?'' మంజుల రెండు కళ్ళూ వర్షించడానికి సిద్ధంగా వున్నాయి.

''అంటే నేను చెప్పలేను. నాకా అర్హత లేదు. అంతే.''

''మీకున్న అర్హతలేవో నాకు తెలుసు. నన్నెందుకిలా మభ్యపెట్టాలని చూస్తారు?''

''పొరబడుతున్నారు. నన్ను గురించి మీ కేమీ తెలియదు. అంతా తెలుసుకున్నవాడు మీరు నా మొహం కూడ చూడరు. ఒక వేళ మీరు వ్యామోహంలో పడినా ఈ సంబం ధానికి మీ పెద్దలు ఎంతమాత్రం అంగీక రించరు. మన వివాహం జరగడం అసంభ వం.'' బాధగా తలవంచుకున్నాడు.

''మీరు చూపించే కారణం నా దృష్టిలో పెద్ద అభ్యంతరం కాకపోవచ్చు. నా కథ్యం తరం తెలిపినాడు మా నాన్నగారూ అడ్డు చెప్పరు. ఏమిటది చెప్పండి.'' ఆశని చంపు కోలేక జాలిగా చూస్తూ అంది.

చెప్పలేనన్నట్లు తల వూపాడు హరీష్.

''ఎందుకింత డొంకతిరుగుడు. నన్ను చేసుకోటం మీకే ఇష్టంలేదని స్పష్టంగా చెప్పరాదూ. ఆడది తనంత తాను మనస్సు విప్పి చెప్తే ఎవరికైనా లోకువగానే వుంటుంది.'' మంజుల కళ్లల్లో కోపజీరలు

వణుకుతున్నాయి. కంఠం కొద్దిగా వణికింది.

"మీరు నన్ను అర్థం చేసుకోటంలేదు."

"నిజమే. అర్థం చేసుకోలేదు కనకనే తెలివి తక్కువగా మనసు పారేసుకున్నాను." దుఃఖము, ఆవేశము ఆమె కంఠాన్ని నొక్కివేశాయి. అంతలోనే అది ఆర్ద్రంగా మారిపోయింది. "ఎవరి బలవంతం వల్లనైనా మరో..."

"లేదు. అలాంటిదేంలేదు అసలు నాకీ జీవితంలో వివాహ యోగ్యతలేదు. బ్రతికి నన్నాళ్ళూ రోగినారాయణ సేవ చేసుకుంటూ జీవితం గడపవలసిన నా మీద ఆశలు పెట్టుకున్న ఏ స్త్రీకయినా నిరాశే మిగులుతుంది."

"అంటే?" పట్టుదలగా అడిగింది మంజుల.

"అది కేవలం నా ఒక్కడికీ సంబంధించిన విషయం అయితే తప్పకుండా చెప్పేవాడిని. కాని నా జీవితంతో ముడిపడి వున్న మరో వ్యక్తిని కూడ నలుగురిలో అవమానం పాలు చేసే అధికారం నాకు లేదు."

మంజుల కనుబొమ్మలు కొద్దిగా ముడుచుకున్నాయి. "ఎవరా వ్యక్తి."

"ప్లీజ్. నన్ను బలవంతం చెయ్యకండి." అరచేతిలో మొహం దాచుకుని, తన నిస్సహాయ స్థితికి నిశ్శబ్దంగా రోదిస్తున్న హరీష్‌కి,

"సరే. నే వెళ్తున్నా." అన్న మంజుల మాటలు వినిపించలేదు.

కొద్దిక్షణాల తరువాత కళ్ళు తెరిచి చూసేసరికి ఎదురుగా మంజుల లేదు.

"అరే ఎంత పొరపాటు చేశాను." అనుకుంటూ గబగబా లేచి కారు దగ్గరికి పరుగెత్తాడు. దూరం నించే, రిక్షా మాట్లాడుకుంటున్న మంజులని గుర్తుపట్టి ఆగమన్నట్లు చేయి చూపాడు. కాని మంజుల చూడనట్లు రిక్షా ఎక్కికూర్చుని పోనిచ్చింది.

హరీష్ ఒక్కసారి దీర్ఘంగా నిట్టూర్చి, "చివరికి ఈ స్నేహం ఇలా పరిణమించింది." అనుకున్నాడు. హఠాత్తుగా, గుర్తు వచ్చినట్లు వాచీ చూసుకుని, "అబ్బా! ఎంత టైమయింది. మంజుల వాళ్ళింట్లో ఖంగారుపడరు కదా! అయినా తను స్నేహితురింటికి వెడుతున్నానని చెప్పేఉంటుందేమో" ఆలోచిస్తూనే వెళ్లి స్టీరింగ్ ముందు కూర్చున్నాడు.

* * *

# అరాంగి

గేటు తెరుచుకుని రాబోతూ ఒక్క క్షణం ఆగి లోపలికి చూశాడు హరీష్. తలుపులు దగ్గరగా వున్నాయి.

"వరండాలో కూడ ఎవరూ లేరు. ప్రొద్దున్నే, పనివేళ, లోప లెక్కడో వున్నారు కాబోలు. అయినా రోజులా చొరవగా ఎందుకు వెళ్లలేకపోతున్నాను. ఇలా బెదురుగా ఏదో తప్పు చేసినట్లు సిగ్గుగా వుందేమిటి?.. మొన్నటి నా ప్రవర్తన మంజులకి కోపం తెప్పించిన మాట నిజమే. అప్పుడే ఆమెని క్షమార్పణ కోరుకుందామనుకున్నాను. ఆ అవకాశం ఇవ్వకుండానే ఆ అమ్మాయి వెళ్లిపోయింది. అయినా నేను ఆమె కోరిక అంగీకరించే స్థితిలో లేనప్పుడు, కేవలం క్షమార్పణ కోరుకున్నందువల్ల ఆమెకి ఒరిగేదేమీ వుండదు. ఇప్పుడు నన్ను చూడగానే ఏం చేస్తుందో? ఏం చేస్తుంది. మొహం చాటు చేసుకుని వెళ్లిపోతుంది. రోజులా నవ్వుతూ పలకరించదు. అయినా ఇదేమిటి?, ఆమె కోసమే నేనీ యింటికి వస్తున్నట్లు ఇలాంటి ఆలోచనలు వస్తున్నాయి.' ఆలోచిస్తూనే మెల్లగా అడుగులు వేసుకుంటూ తలుపు దగ్గరికి వెళ్లి నెమ్మదిగా తట్టాడు లోపలనించి ఎలాంటి సమాధానం రాలేదు మరోసారి తట్టబోయేసరికి లోపల గడియ లేకపోవడం వల్ల తలుపులు అవే తెరుచుకున్నాయి. లోపలంతా నిశ్శబ్దంగా వుంది. ఎక్కడా మనిషి వున్న అలికిడి కూడలేదు. అతని గుండెలు అవ్యక్తమైన భయంతో దడదడలాడాయి. అలాగే నిలబడి, "మంజులా." అని పిలిచాడు. సమాధానం రాలేదు. అంతా ఎక్కడికి వెళ్లిపోయి వుంటారు అనుకుంటూనే సుదర్శనం గారి గదిలోకి దారితీసిన హరీష్ గుమ్మం దగ్గరే ఒక్క క్షణం నిలబడిపోయాడు కొయ్యబారిపోయినట్లు.

కళ్ల మీద చేయి ఆనించుకుని కుళ్లి కుళ్లి ఏడుస్తున్నారు సుదర్శనం గారు. ఆహృదయ విదారకమైన దృశ్యం చూస్తూనే చలించిపోయి, రెండు అంగల్లో మంచాన్ని సమీపించి, మృదువుగా ఆ చేయి తీస్తూ.

"ఏమిటి? ఏమయింది. వీళ్లంతా ఏరీ?" అన్నాడు. ఎంత ఆపుకుందామనుకున్నా, అతని కంఠం కొద్దిగా వణికింది.

సుదర్శనంగారు కళ్ళు తెరిచి చూశారు.

"ఎవరు? డాక్టరుబాబా? బాబూ వాళ్ళంతా నన్ను దిక్కులేనివాడిని చేసి వెళ్లిపోయారు" అని పసపిల్లవాడిలా బావురుమన్నారు. అతని చేయి పట్టుకుని.

"అసలేం జరిగింది?" కుర్చీ మంచం దగ్గరగా జరుపుకుని కూర్చున్నాడు హరీష్. అతని చేయి యింకా ఆయన చేతిని నిమురుతూనే వుంది.

సుదర్శనంగారు వెంటనే ఏం సమాధానం చెప్పలేదు. దుఃఖం దిగమింగడానికి ప్రయత్నం చేస్తూ కళ్ళు మూసుకు పడుకున్నారు.

"మంజుల ఎక్కడికి వెళ్లింది? మీభార్య, అబ్బాయి ఏమయ్యారు?" ఆయన మౌనం అతనిలోని ఆత్రుతని ఇంకా ఎక్కువ చేసింది. అయినా ఎందుకో వాళ్ళు ముగ్గురూ ఒకటై సుదర్శనంగారిని ఇలా వదిలేసి వెళ్లిపోతారని అతను నమ్మలేకపోతున్నాడు.

"ఏం చెప్పమంటావు బాబూ, ఇన్నాళ్ళుగా వస్తూపోతూ వున్నావు. ఈ యింటి విషయాలు కాస్తయినా గ్రహించుకునే వుంటావు." ఉన్నట్లుండి తన వాళ్ళంతా మాయం అయిపోయాక, కాస్త ఆదరంగా మాట్లాడే మనిషి కనిపించే సరికి ఆ సంతోషంలో మర్యాదని మరిచిపోయాననే సంగతి ఆయనకి తోచలేదు. "కొన్ని సంవత్సరాలుగా మా అందర్నీ లోలోపలే వేధిస్తున్న సమస్య నిన్న బయటపడి తీవ్ర రూపం దాల్చింది...

"మంజుల పెళ్లి విషయమే అనుకుంటా."

"ఔను. చిన్నప్పుడే తన వివాహం స్థిరపడి పోయింది ఒక విధంగా. కాని అది మంజుకి ఎంతమాత్రం సమ్మతంగా లేదని నేను గ్రహించుకున్నాను. కొన్ని కారణాల వల్ల ఆ సంబంధం నాకూ యిష్టం లేకపోయింది. సమయం వచ్చినప్పుడు తగిన వరుడ్ని చూసి తన పెళ్లి జరిపించాలనుకున్నాను. ఆ అవకాశం రాకముందే నేనిలా మంచం పట్టాను. అయినా తనకి ఏం భయం లేదని, వాళ్ళ నాన్నగారికి వ్రాసి అన్నివిషయాలు చెప్తానని ధైర్యం చెప్పాను. పిచ్చిపిల్ల నా మాట నమ్మలేక పోయింది. ఇంతప్పటి నుంచి నా చేతుల్లో పెరిగి నా గుండెల మీద ఆడుకున్న మంజు నన్ను వదిలేసి వాళ్ళ నాన్న దగ్గరికి వెళ్లిపోయింది"

"ఇంతకు ముందెప్పుడూ ఆవిడ అక్క

డికి వెళ్ళలేదని చెప్పారు."

"నీకూ చెప్పిందా? అది నిజమే. కాని ఏమిటో సవితితల్లి బాధలు పెట్టేస్తుందని, తండ్రి సరిగ్గా చూడడని వూహించుకుంటూ ఈ ప్రత్యక్ష నరకంలో వుండలేకపోయింది."

"సరే. ఆవిడికి వ్యక్తిగతమైన సమస్యలు, అందులోనూ జీవితంలో అతిముఖ్యమయిన సమస్యని గురించి విషమ పరిస్థితి ఏర్పడినప్పుడు అక్కడైనా తనకి కావలసిన సహాయం సానుభూతి దొరుకుతాయేమోనని వెళ్ళిపోవడంలో తప్పులేదు. మరి వీళ్ళు"

"డబ్బు బాబూ, డబ్బు మహత్యం, ఇదంతా. నీకు ఫీజు ఏమీ ఇవ్వకపోయినా, ఈ జబ్బుకి అవుతున్న ఖర్చులన్నీ మంజులే భరించింది ఇన్నాళ్ళూ. ఇంక ఆమె వెళ్ళగానే అవన్నీ తన మీద పడతాయని జానకి తప్పుకుంది."

"డబ్బు ఖర్చు అయిపోతుందని, అగ్నిసాక్షిగా వివాహమాడిన భార్య, నీ రక్తం పంచుకు పుట్టిన కొడుకు మిమ్మల్నీ స్థితిలో వదిలి వెళ్ళిపోయారంటే నాకు నమ్మకం కలగడంలేదు."

"ఊహు. కొన్ని నిజాలంతే. అతి సహజంగా కనిపించే మోసాన్ని అసత్యాన్ని నమ్మగలిగినంత సులభంగా, భయంకరమైన నిజాన్ని నమ్మలేం. నీ కింకో సంగతి చెప్పనా? ఇది వింటే నువ్వు నాకు మతిభ్రమిస్తోందనుకుంటావే కాని నేను నిజం చెప్తున్నానని నమ్మలేవు."

ఏమిటి అన్నట్టు చూశాడు భయపడుతూనే.

"జానకి నాభార్యకాదు. శంకరం నా కొడుకూ కాదు. నేను చెప్పలేదూ, నువ్వు నమ్మలేవు.. అయినా శాస్త్రోక్తంగా వివాహం అంటూ జరగకపోయినా ఇన్ని సంవత్సరాల నించీ అందరి చేత నా భార్యగా గుర్తించబడుతూ, నాతో కలిసి వున్న అనుబంధమూ అభిమానమూ ఆవిడిని పట్టి వుంచుతాయనుకున్నాను. ఆవిడికి అలాంటి బంధాలేం లేవు. ఉన్నదంతా ఒక్కటే. అదే డబ్బు మీద అంతులేని లాలస."

అయోమయంగా ఆయన మొహంలోకి చూస్తూ కూర్చున్నాడు హరీష్.

"అయితే నాకూ ఒక భార్య వుండేది. అగ్నిసాక్షిగా వివాహం ఆడిన ఆ భార్యని, భగవంతుడు అనుగ్రహించిన బిడ్డని—నేనే, ఈ చేతులతోటే హత్య చేశాను. నేను హంతకుడివి."

ఆపాదమస్తకం ఒక్కసారి జలదరించినట్లయింది హరీష్‌కి. నోరు తడారిపోయింది ఏం మాట్లాడాలో తెలియక, అసలు నోరు తెరవడం సాధ్యంకాక మౌనంగా సుదర్శనం గారి మొహం వేపు బెదురుగా చూస్తూ కూర్చున్నాడు. ఆయన ఊపిరి పీల్చుకోడానికేమో కొద్దిక్షణాలు ఆగారు. ఎగిరెగిరి పడుతున్న గుండె, మూసి వున్న కనుల నుండి ధారగా ప్రవహిస్తున్న కన్నీళ్ళు ఆయన ఎంత సంక్షోభానికి గురి అవుతున్నారో తెలియజేస్తున్నాయి. కొద్దిక్షణాల తరువాత కళ్ళు తెరుస్తూ,

"నా కథంతా చెప్తాను. వింటావా బాబూ." అన్నారు.

"వింటాను."

"అదంతా చాల పెద్దకథ. నీకు అవతల హడావిడి..."

"అబ్బే. ఇవాళ తొందర పనులేం లేవు చెప్పండి వింటాను."

ఆ సమాధానానికి తృప్తిపడ, ఆయన లేవబోతూంటే, హరీష్ వెళ్ళి ఆయనని సరిగ్గా కూర్చోపెట్టి అనుకునేందుకు తలగడలు సరిజేశాడు.

"పాపిష్టి వాడిని. డాక్టరు చేత కూడ చేయించుకుంటున్నాను." అన్నా రాయన.

"ఫరవాలేదు. ఈ మాత్రానికేనా.. అయినా మీ పని కుర్రాడేడీ కనిపించడేం? వాడు కూడ మానేయ లేదుకదా?" భయపడుతూనే అడిగాడు కుర్చీలో కూర్చుంటూ.

"ఆ. అదీ జరుగుతుంది వాడికి ఈ నెలాఖరి దాకా జీతం ఇచ్చి వెళ్ళిందిట మంజుల. అందుకే వాడు ఇంకా వున్నాడు. ఇప్పుడే వస్తానంటూ ఇంతకుముందే ఎక్కడికో వెళ్ళాడు. రాకపోయినా ఆశ్చర్యపడక్కరలేదు. అంతేకాదు, ఈ యింటికి కూడ ఈ నెలకే అద్దె యిచ్చింది జానకి. తరువాత వాళ్ళు ఒక్కక్షణం కూడ నన్నీ యింట్లో వుండనివ్వరు. నేను లేవలేకపోతే నలుగురూ కలిసి సాయం పట్టి అయినా వీధిలో పడేస్తారు..."

"అంతమాట అనకండి మేమంతా లేమూ? మీ కలాంటి స్థితి కలగనిస్తామా?"

"మీ కందరికీ కూడ భారమయే దాకా బతికమన్నావా బాబూ నన్ను. ఎంత త్వరగా ఈ ప్రాణం పోతుందా అని ఎదురు చూస్తున్నాను. కాని ఇన్నాళ్ళ నించీ నేను మూట కట్టుకున్న పాపం నా ప్రాణాన్ని హాయిగా పోనివ్వటంలేదు ఇవాళ నీ ముందు నా పాపాలన్నీ ఒప్పుకుని హృదయ భారం తీర్చుకుంటే ఇంత నిశ్చింతగా కళ్ళు మూస్తాను. సరే. ఉపోద్ఘాతం తోటే కాలయాపన చేస్తున్నానేమో ఇంక నా కథ మొదలు పెట్టబోయే ముందు మరో రెండు మాటలు చెప్తాను.

మనిషి తన తెలివితేటలు ఉపయోగించి ఎన్నో సృష్టి రహస్యాలన్ని తెలుసుకుంటున్నాడు. కాని ఇంతవరకూ మానవ మేధకీ విజ్ఞాన పరిశోధనలకీ అందని మరో రహస్యం ఉండిపోయింది. అదే మానవ స్వభావం. మనిషి ఎప్పుడు ఎందుకు ఎలా ప్రవర్తిస్తాడు అనేది ఏ విజ్ఞానవేత్త, మనస్తత్వ పరిశీలకుడు విడదీయలేని జటిలమైన సమస్యగానే ఉండిపోయింది. ఒకే విధమైన తెలివితేటలు, అవకాశాలూ ఉన్న పదివందికి ఒకే



# అర్ధాంగి

లాంటి [illegible] పదిహారేడి పది రకాలుగానూ ప్రవర్తిస్తారు. దీనికి కారణం ఏమిటి, వాళ్ళ జీవితాలు ఆ విధంగానే ఎందుకు సాగిపోతున్నాయి అనే ప్రశ్న వస్తే, అది కేవలం నుదుటి వ్రాతే అని చెప్పుకోవాలి మనం. లేకపోతే అన్ని విధాల అనుకూలవతి అయిన భార్య దొరికి కూడ ఏనీ వాడు ఇలా దిక్కులేకుండా కుళ్ళి కుళ్ళి ఏడవాల్సిన పరిస్థితి రాదు...'' ఆయన గొంతు బొంగురుపోయింది. చెప్పటం ఆపి, లాల్చి చివరతో కళ్ళు ఒత్తుకుంటూంటే,

''మీరు చాలా ఆయాస పడుతున్నారు. ఈ స్థితిలో ఎక్కువగా మాట్లాడటం...''

మధ్యలోనే అతన్ని ఆపి, ''లేదు బాబూ వయాస ఏమీలేదు. ఎలాగయినా ఇవాళ చెప్పకపోతే మళ్ళీ ఇలాంటి అవకాశం రాక పోవచ్చు. నా పాపిష్టి కథ నా నోటితోనే చెప్పుకుని ఆ పాప భారాన్ని కొంతవరకైనా తగ్గించుకోవాలనే నా కోరికను కాదనకు'' అన్నారు. ఎలా మొదలు పెట్టాలా అన్నట్లు ఒక్కక్షణం ఆలోచించారు.

''ఆ. అవి నేను క్రొత్తగా ఉద్యోగంలో చేరిన రోజులు...

*  *  *

ఆఫీసు నించి అలిసిపోయి వచ్చిన కొడుక్కి కాఫీ అందిస్తూ, ''ఇవాళ మామయ్య దగ్గర నించి ఉత్తరం వచ్చింది.'' అంది సుభద్రమ్మ గారు ముసి ముసిగా నవ్వుతూ.

''ఏమని?''

''అదే వెనక చెప్పాడుగా ఏదో సంబంధం వుందని. దాని మాటే. వాళ్ళు తొందర పడుతున్నారుట. మనం వెళ్ళి పిల్లని చూసుకుంటే, మిగతా విషయాలు తరవాత మాట్లాడుకోవచ్చు.''

''నా కిప్పుడిప్పుడే పెళ్ళి చేసుకోవాలని లేదమ్మా. అయినా ముందు సుశీలకి కాని వ్వండి. నాకు తొందరేమిటి?''

''మనకి అనువైన సంబంధం వచ్చి నప్పుడు చూసుకోవాలేకాని ఒకళ్ళతో వంతు పెట్టుకోకూడదు. దానికీ ఏవో చూస్తూనే వున్నాం. ఏది ముందు కలిసివస్తే అది చేసే యాలని మా వుద్దేశ్యం.''

''నన్నిప్పుడేమీ బలవంతం చేయకు.'' అంటూ ఖాళీ గ్లాసు తల్లి చేతికిచ్చి వెళ్ళి పోయాడు సుదర్శనం.

ఓ నెలయినా గడవకుండానే ఓ ఉదయం ఆఫీసుకి వెడుతున్న కొడుకుతో, ''రేపూ, ఎల్లుండి శలవు పెట్టు. సాయంత్రం బయలుదేరి రామాపురం వెడదాం.'' అన్నారు నరసింహంగారు.

''పెళ్ళి చూపులకేనా? ఇప్పుడు నేను చేసుకోనని చెప్పానుగా?'' తండ్రి అంటే ఉండే భయంతో బెదురుతూనే చెప్పాడు సుదర్శనం.

''వచ్చిన సంబంధాలన్ని వదులుకుంటే మనం కావాలనుకున్నప్పుడు మంచిది వస్తుందా? ఇది అన్నివిధాలా బాగుంది. నిన్నంతా ఆలోచించి నేనూ మీ అమ్మా ఓ నిశ్చయానికి వచ్చాం.'' శాసించినట్లే చెప్పేశారు.




తండ్రిని ఎదిరించే ధైర్యంలేక ఆయన ఇష్టప్రకారమే నడుచుకున్నాడతను.

''పిల్ల ఎలా వుందిరా?'' తిరిగివచ్చిన వాళ్ళకి కాఫీ ఇస్తూ అడిగింది సుభద్రమ్మ.

''నా కేం నచ్చలేదమ్మా.''

''నచ్చకపోవడం ఏమిటి? పిల్ల లక్ష్మి దేవి లాగుంది. కాకపోతే కాస్త ఓ ఛాయ తక్కువనుకో. సంబంధం వదులుకోవలసి నంత పెద్ద కారణం కాదది.'' తన అభి ప్రాయం తెలియజేశారు నరసింహంగారు.

''ఏమో. నాకు ఇష్టంలేదు.'' తలవం చుకునే నసిగేశాడు సుదర్శనం.

ఓ సారి చికాగ్గా కొడుకు వైపు చూసి ఇవతలకి వచ్చేశారు నరసింహంగారు.

''నువ్వసలు సరిగ్గా చూశావా? పోనీ నేను కూడ ఓసారి వెళ్ళి చూసి వస్తాను. మరీ కారు నలుపయితే నిన్ను బలవంతం చేయనులే.'' అని కొడుకుని ఒప్పించిందావిడ.

పిల్లని చూసి తిరిగి వచ్చిన సుభద్రమ్మ, ''నిక్షేపం లాంటి సంబంధం. బంగారం లాంటి పిల్ల. నీ కెందుకు నచ్చలేదో నా కర్థం కావటంలేదు. మొదటి నుంచీ వద్దంటూనే మా బలవంతం మీదే వెళ్ళా వేమో.'' అంటూ కొడుకు చెవిలో యిల్లు కట్టుకుని పోరసాగింది.

తల్లిదండ్రుల బలవంతానికి కారణం కొద్దిరోజులలోనే తెలిసింది సుదర్శనానికి. శాంత తల్లిదండ్రులకి ఏకైక సంతానం. అంతేకాదు. ఇరవై ఎకరాల సుక్షేత్రమైన మాగాణికి, ఆ పల్లెటూరిలో రెండు మండు వాల యింటికి వారసురాలు. అదీ అక్కడి ఆకర్షణ. వాళ్ళు ఎంత చెప్పినా సుదర్శనం మాత్రం మనస్సుని తిప్పుకోలేక పోయాడు. నిజం చెప్పాలంటే శాంత మరీ అనాకారి కాదు. మరీ నలుపూ కాదు. కాని ఏమిటో, ''నా కిష్టంలేదని చెప్పిన దానికింత బల వంతం ఏమిటి?'' అనే పట్టుదల వచ్చింది. అంతే. చివరికి విసుగేసి, ''మీ అందరి బల వంతం మీద ఆ అమ్మాయి మెడలో మంగళ సూత్రం కడతాను. తరువాత పరిస్థితులకు మాత్రం నాది బాధ్యత కాదు.'' అన్నాడు కసిగా.

''ఆ. ఇలాంటివి లక్ష చూశాం. ఆ మూడు మూళ్ళూ పడేదాకానే ఈ ప్రగల్భా లన్నీ. తరువాత భార్య కొంగు పట్టుకునే తిరుగుతారు.'' అన్నారు నరసింహం గారు నిర్లక్ష్యంగా.

(సశేషం)

వనితాలోకం:

# చదువులూ - అభిప్రాయాలూ

అసలు ఆడపిల్లలకి చదువు కావాలా? వద్దా? అన్న ప్రశ్నకి అర్థమే లేదు. చదువు అన్నది విజ్ఞానం కోసరం. మనిషై పుట్టిన ప్రతీ వారికీ చదువు కావాలి. అది అందర్కీ తెల్సిన విషయమే. కానీ ఈ మధ్య అన్ని పత్రికలలోనూ ఆడపిల్లల్ని బి. ఎ. చదివిస్తే అంత కంటె ఎక్కువ చదువు కున్నవారినే తేవాలి. అందుమూలంగా పెళ్ళిళ్ళు కష్టమయిపోతున్నాయి అని అందరూ వ్రాస్తున్నారు.

ఇందులో నిజం లేక పోలేదు. కానీ దీనికి ముఖ్యకారణం మన దృక్పథంలోని లోపం మాత్రమే.

మొట్ట మొదట, మగవాడు సమంగా ఉద్యోగం చేసుకుంటూంటే, బి. ఎ. చదివిన పిల్ల బి. ఎ. నే చదివిన పిల్లవాడిని గానీ అంతకంటె తక్కువ చదివిన వాడినిగాని చేసుకోవడానికి అభ్యంతరం ఎందుకు చెప్పాలో నాకర్థం అవదు. మిగిలిన అన్ని విషయాల్లో తమకి నచ్చితే తమ పిల్లకంటె ఎక్కువ చదవలేదన్న ఒక్క కారణంకి పిల్లనివ్వకపోవడం అవివేకం. మాకు తెల్సిన ఒక లేడీ డాక్టరు మెట్రిక్ ప్యాసయి బిజినెస్ చేస్తున్నతన్ని పెళ్లి చేసుకుంది. వారి సంసారంకి లోటేంలేదు.

అటుపైని అందరూ డిగ్రీ చదువులే చదవాలని తాపత్రయపడ్డం కూడా నాకు అర్థం కాని విషయమే. డిగ్రీలున్న వారికి కట్నాలిచ్చుకోనేరం అనుకుంటూనే తమ ఆడపిల్లల్ని డిగ్రీ కోసరమే చదివించడం అవివేకం.

చాలా మంది విజ్ఞానార్జన కంటె కూడా పిల్లకి పెళ్లయ్యేటంతవరకూ ఇంట్లో గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోకుండా, చేతినిండా పని వుంటుందన్న ధ్యాసతో చదివిస్తున్నారు. అలాంటివారు మెట్రిక్ తర్వాత డిగ్రీ చదువులు కాక వేరే ఏదైనా చదవవచ్చు. అలాంటి వారికి పని కొచ్చేందుకనే ఈ వ్యాసం. చాలా మంది ఈ ప్రాంతాల్లో టైపు, షార్టుహాండు చదివి స్టెనోలగా చేరి సంపాదిస్తున్నారు. కనుక యిది సంపాదించదల్చుకున్న వాళ్కికూడా మంచిదేను. షార్టుహాండు నేర్చుకుంటే అంగ్లభాష కొంత తప్పులు లేకుండా వ్రాయడానికి కుదురుతుందంటారు.

ఏర్‌హోస్టెస్ పనికీ, నర్సుల పనికీ అందరిళ్ళల్లోనూ ఒప్పుకోరు. కానీ కమర్షియల్ ఆర్ట్స్, (వ్యాపారం కొరకు ఉపయోగించే చిత్రకళ), డాల్ మేకింగ్ (బొమ్మల తయారీ) కుట్టుపనిలో డిప్లొమాలు, కేటరింగు, డయెట్‌ఎతిక్సు, పూలతో వివిధ రకాలయిన అరేంజిమెంట్సు, స్త్రీల పాలిటెక్నిక్కు, జర్నలిజం, లైబ్రేరీ సైన్సులు, ఇవన్నీ చదువులే. కొన్ని కొని పెద్ద పట్నాల్లో మాత్రం వుంటాయి. కొన్ని చిన్న వూర్లలోనూ ఉంటాయి. పెళ్లయ్యేంత వరకూ ఏదో ఒక వ్యాపకంగా డిగ్రీ చదువులు చదివించటం కంటే చిత్ర లేఖనం (ఇది మూడేళ్ల కోర్సు, పట్టణాల్లో వున్నాయి), సంగీతం (వీటికి డిప్లొమాలు, కాలేజీలు అనీ వున్నాయి అని అందర్కీ తెల్సు), కుట్టుపని, లేదూ హిందీ అలా చదివించకూడదా? పైన చెప్పినవి కాక ఇంకా అనేక రకాలైన కోర్సులున్నాయి. చాలా వాటికి ఎస్. ఎస్. ఎల్. సీ. అయితే చాలని పేపర్లలో ప్రకటనలు వస్తాయి. మనవాళ్లు వాటిని చూసి ఎందుకు ఉపయోగించుకోరో కదా!

డిగ్రీ చదువులు కావాలి అనుకునే వాళ్కి, పెళ్లి చేసుకోకుండా కెరీర్ విశ్వయించుకునే వాళ్కి కాదీ వ్యాసం. ఎవరైతే డిగ్రీ చదువులు చదివితే పెళ్లిళ్లు కష్టం అవుతున్నాయి అనుకుంటున్నారో వాళ్లకి ఉపయోగపడుతుందేమోననేను. కట్నం ఆడపిల్లలు గలవారికి ఎలాగూ తప్పటం లేదు. డిగ్రీ చదువులకయ్యే ఖర్చుని ఏదైనా ఇలాంటి ప్రొఫెషనల్ కోర్సులకి కొస్త పెట్టితే ఇవీ ఉద్యోగంలో చేరా లనుకునే వారికి సహాయంగానే ఉంటాయి. కాలేజీల్లో యింతింత సీట్ల కోసం బాధలూ ఉండవేమో కదూ!

అసలు ప్రతీ ఆడపిల్లా పెళ్లి అయ్యేంత వరకూ మాత్రమే చదువుతుంది. ఆర్థికంగా బాధలు లేని వారికి ఏమిటిచెయ్యాలి అన్న ప్రశ్నే లేదు. కాని మధ్య తరగతి వారిగూర్చే బాధంతాను. ఇంగ్లీషులో అన్నట్లు 'ఐడిల్ మాన్స్ మైండ్ ఈజ్ ఎ డెవిల్స్ వర్క్ షాప్'. చేతినిండా పని లేకపోతే బుర్ర అనేక విధాలుగా ఆలోచిస్తుంది. వ్యాపకం లేకపోతే ఆడపిల్లకంత ఆరోగ్యకరంకాదు. అందుకే వ్యాపకం కోసరం, ఆ పెళ్లి కుదిరేంత వరకూ అనుక్కునే వారు, కాలేజీల్లో చేరి డిగ్రీ చదువులు చదవాలని లేదు. ఇంకే విధమైనదైనా వ్యాపకంగా వుంచుకోవచ్చును. నేర్చుకున్న విద్యని పెళ్లయ్యాక ఇంట్లోఉండే సద్వినియోగం చెయ్యగల్గితే ఆ ఆడపిల్లకి ఎంత తృప్తిగా ఉంటుందో వేరే చెప్పక్కరలేదు. చిత్రలేఖనం అంటే ఆసక్తి ఉన్న పిల్లని 'కమర్షియల్ ఆర్ట్స్' కోర్సులో చదివించారనుక్కోండి. పెళ్లయినా యింట్లోవుండి ఏ స్నోకో పౌడర్‌కో అడ్వర్టయిజు మెంటుకి బొమ్మలు వేసి సంపాదించవచ్చును.

అలానే వ్యాసాల పట్ల ఆసక్తి ఉన్న వాళ్కి 'జర్నలిజం' లో చేర్పిస్తే పెళ్లయినా అది ఉపయోగపడ్తానే ఉంటుంది.

ఈ మధ్య చాలా వాటికి పోస్టుద్వారా నేర్పించడానికి కొన్ని సంస్థలు కూడా అన్ని పత్రికల్లోనూ ప్రకటనలు యిస్తున్నారు. కాలేజీ చదువులకి ఖర్చు పెట్టగల్గిన వారు దీనికీ పెట్టగల్గే ఆర్థిక స్తోమతు కల్గే ఉంటారు. వూరికే గొప్ప కోసం కాక, ఒకదాన్ని నేర్చుకోవాలన్న ఆసక్తి వుంటే, కాలేజీకి, విశ్వ విద్యాలయాలకీ వెళ్ళి డిగ్రీలే చదవక్కరలేదని మనం తెల్సుకోవాలి. అన్ని చదువులూ చదువులే అన్న నిజం మనం తెల్సుకోవాలి. మెడిసిన్, ఇంజనీరింగు, బి. ఎ. ఇవే చదువులు అని అనుక్కోకూడదు.

'ఏదో ఈ బి. ఎ. అయితే పెళ్లిచేసేస్తాం' అనే ధోరణి వున్నవారు, బి.ఎ. చదివిందాయె, ఎమ్మే అయినా దొరకాలా ఎంత కట్నం పొయ్యాలో' అనుకునేవారు ఇలాటి దృక్పధాల్ని మార్చుకోవాలి. ఒకటి అమ్మాయిల్ని డిగ్రీ చదువు కాక మరో చదువులో నైనా పెట్టాలి, లేదూ అబ్బాయిది అమ్మాయి చదివిన చదువైనా పిల్లని ఇవ్వ గల్గాలి. అప్పుడే ఆడపిల్లల చదువుల వల్ల కల్గే సమస్యలలో ఈ ఒక్కదానికైనా పరిష్కారం ఉంటుంది.

—విశాఖ

# వారఫలం

## 2-9-1966 శుక్రవారం మొదలు 8-9-1966 గురువారం వరకు.

**మేషం :** వృత్తి వ్యాపారాల్లో చాలా శ్రమమీద స్వల్పాభివృద్ధిని సాధించ గలరు. వారం ప్రారంభంలో సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. పాటివారిలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగు తుంది పుణ్యకార్యాలు చేస్తారు.

**వృషభం** వ్యాపారంలో మీరు యిదివరకు కొన్ని వ్యవహారాలను నిర్లక్ష్యం చేయడం వలన యిప్పుడు యిబ్బంది కలుగుతుంది. అవసరానికి యేదో ఒక విధంగా డబ్బు చేతికి వస్తుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు కొంచెం శ్రమ మీద నెరవేరుతాయి. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. విలాస వస్తువులు కొంటారు.

**మిథునం** వృత్తి వ్యాపారాల్లో యిదివరకు యేర్పడిన అనిశ్చిత పరిస్థితులు తొలగిపోతాయి. సాహసముతోకూడి వ్యవహారాలుకూడా లాభించగలవు. ప్రయాణాలు ప్రయోజనకరంగా ఉంటాయి. వారాంతంలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి.

స్త్రీలకు— కుటుంబ కార్య క్రమాలు కొంచెం శ్రమ మీద నెరవేరుతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం :** ఇప్పుడు మీరు జరిపే వ్యవహారాల వల్ల కేవలం తాత్కాలిక మైన లాభమే కాకుండా ముస్ముందు కూడా తగిన ప్రయోజనం లభించగలదు. వృత్తిలో నూతన అవకాశాలు లభిస్తాయి. ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొంద గలరు. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది అలంకార వస్తువులు కొంటారు.

**సింహం .** వృత్తిలో యెన్నో అవకాశాలు ఆకర్షణీయంగా కన్పిస్తాయి గాని అవి కార్యరూపాన్ని ధరించడం కష్టం. కొన్ని వ్యవహారాల్లో అధిక వ్యయం జరగడం వలన ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది వారం మధ్యలో కొంచెం మంచి పరిస్థితి యేర్పడుతుంది. అనారోగ్య సూచనలు ఉన్నాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. బంధు మిత్రులను కల్సుకొంటారు.

**కన్య :** — ఈ వారం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. వృత్తిలో కార్యసాధన కోసం మీ అభిప్రాయాలకు వ్యతిరేకంగా వ్యవహరించ వలసి వస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలకు లొంగి పోవడం తగదు. సాహిత్య కళా రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. ప్రయాణాలు శ్రమ మీద ఫలిస్తాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి

**తుల** వృత్తి వ్యాపారాల్లో శ్రమకలిగినా, దానికి తగిన ఫలితం లభించగలదు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో యితరుల జోక్యంవలన నష్టం వస్తుంది. ఉద్యోగంలో మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. రాజకీయ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు— కుటుంబ కార్య క్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరుతాయి పుణ్యకార్యాలు చేస్తారు.

**వృశ్చికం :** వ్యాపారంలో మీ అభిప్రాయాలు సరియైనవని రుజువు కావడంవలన పాటివారిలో గౌరవం లభిస్తుంది. వృత్తిరీత్యా చేసే ప్రయాణాలు లాభ దాయకంగా ఉంటాయి అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. కుటుంబ సంతోషం లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం యిదివరకటి కంటే బాగా ఉంటుంది సంతోషకరమైన వార్తలను వింటారు.

**ధనుస్సు :** వృత్తి వ్యాపారాలు అనుకూలంగానే ఉన్నట్లు కన్పిస్తాయి గాని మీరు యేమాత్రం యేమరు పాటుగా ఉన్నా, అవస్థమీది, అనుభవం మరొకరిది కాగలదు. అకారణంగా పాటి వారితో మాట పట్టింపులు రావచ్చును. ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. సాంఘిక కార్య క్రమాలకు మార్పులు వస్తాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్య భారం పెరుగుతుంది.

**మకరం :** కొంత మంది మిత్రుల వ్యవహారాల్లో జోక్యం చేసికోవడం వలన కార్య భారం పెరుగుతుంది. సాహసముతోకూడిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో మీకు ముస్ముందు లాభించగల వ్యవహారాల్లో అనుకూలతను సాధించ గలరు. ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి.

స్త్రీలకు— సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

**కుంభం :** ఆదాయం మాట యెలాగ ఉన్నా, అవసరానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది. వ్యాపారంలో పాటివారితో పోటి పెరుగుతుంది. సాంఘిక కార్య క్రమాల్లో మాట పట్టింపులు రావచ్చును. మిత్రుల సహాయం లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సు కొంటారు.

**మీనం·** వృత్తి వ్యాపారాల్లో యిదివరకు యేర్పడిన చికాకులు తొలగిపోతాయి. వ్యాపారంలో మీ యెదుట పొగడుతూ చాటున దూషించే వ్యక్తులతో వ్యవహరించ వలసి వస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

స్త్రీలకు— కుటుంబ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. విలాస వస్తువులు కొంటారు.

—మహేష్

# పెప్సోడెంట్ యొక్క ఇరియమ్ ప్లస్

## మీ పళ్లను శుభ్రపరచి మెరిసేలా తెల్లగా చేస్తుంది

ఎలాగో చూడండి : పెప్సోడెంట్‌లో మాత్రమే అద్భుతమైన నురుగును యిచ్చే శాస్త్రపద్ధతిలో తయారైన ఇరియమ్ ప్లస్ చేర్చబడినది. ఈ అద్భుతమైన నురుగు సమృద్ధిగా కలిగి మీ నోటిలో అన్ని మూలలకు చేరి పళ్లను శుభ్రముగా, చల్లగా, పెప్పర్‌మింట్ రుచితో ఉంచుతుంది. అంతేకాదు, మీ పళ్లను మెరిసేలా తెల్లగా చేయుటకు ఇరియమ్ ప్లస్‌కు తెల్లదనమునిచ్చే ప్రత్యేకమైన శక్తికూడ ఉంది.




హిందూస్తాన్ లీవర్
లిమిటెడ్ వారి
ఒక విశిష్టమైన తయారు

SWT-HDL-400[illegible]

# గార్డు గోపాలం

## యర్రింశెట్టి సాయి



గార్డు గోపాలం హడావుడి పడిపోతున్నాడు. సరిగ్గా మరో అర గంట టయిముంది తను వెళ్ళాల్సిన ఎక్స్‌ప్రెస్ బండీ బయల్దేరడానికి. కాని......ఇంకా......సుగుణ వంట అవనేలేదు. ఛీ! ఈ ఆడాళ్ళు ఇంతే! అనుకొన్నాడు గోపాలం. రెండు నిముషాలాగి మళ్ళీ ఇలా అనుకొన్నాడు. "తనో ముఖ్యమయిన ఎక్స్‌ప్రెస్ బండీకి గార్డు అనీ, తన కాలస్య మయితే, ఆ రైలుబండికి కూడా ఆలస్య మవుతుందనీ తెలీదూ?.....అందు మూలాన అందులోని బోలెడు మంది ప్రయాణికు లకి అవస్థ అని, పైగా తనకి మాట గూడా వస్తుందని గ్రహించుకోదేం?...... అదీగాక ఈవారం 'పంక్చువాలిటీ వీక్' ఒహటి ఏడి చిందాయె! ఆఫీసర్ల కళ్ళన్నీ ఈవారమంతా తమ బళ్ళ టైములమీదే ఘాటు నిఘా వేసి చూస్తూంటాయి. కాస్త లేటుగాపోతే చాలు......ఆఫీసుకి బుక్‌చేసి దగ్గరనుంచో బెట్టుకొని మరీ తిడతారు......ఇన్ని గొడ వల్లో తను మునక్కా తేలకా చస్తూంటే.... వంట ఇంతవరకూ హయి చావదాయె......

"ఏయ్ పిల్లా!.....రైల్వే బుద్ధులు బాగా అబ్బినయ్ నీకూ!.....ఎప్పుడూ లేటే! ఖర్మ కొద్దీ దొరికావ్....వంటయిందా లేదా?....." అరచాడు గోపాలం.

"ఆ నర్సునే చేసుకొంటే బావుండేది మీకు......" తిరుగమూత పెడుతూఉండగా జవాబులాంటి......విసురు.

ఉక్కిరిబిక్కిరయ్యాడు గోపాలం. తాలింపు ఘాటుగావుంది. ఆ విసురు అంత కంటేనూ. ఒక్కసారిగా తన ఆఫీసరులాగా కోపం వచ్చింది గోపాలానికి.

"సుగుణట!..... సుగుణ!..... వాళ్ళ నాన్న ఆ పేరు బుద్ధిలేక పెట్టాడు. లేక పోతే ఇంత ఈర్ష్య ఏమిటి?.... నిజమే నయ్యా! సుగుణ చూస్తుండగా తనోనర్సుతో నడి బజారులో మాట్లాడాడు. ఇంతకూ పాపం ఆ నర్సుమాత్ర మేం మాట్లాడిందీ? రిజర్వేషన్ గురించి హెల్ప్ చెయ్యమంది. వెంటనే సుగుణ తనని అడిగేసింది.

"ఆమె మీకు ఎలా తెలుసు? ఏమిటి అడుగుతోంది మిమ్మల్ని?" అని.

తను సరదాకి "నాకామె చాలా ఫ్రెండ్! అంచేత లక్ష మాటలు మాట్లాడాల్సివుంటుం ది!" అని జవాబు చెప్పాడు. అంతే! సుగుణ మొఖం ఈస్ట్‌మన్ కలర్‌లోకి మారింది. ఆరోజునుంచి సుగుణ నోటివెంబడి ఆ నర్సు

గురించి ఏదో జోకు విసురుతూ తనువింటూనే ఉంటాడు.

తను కొన్నాళ్ళ చచ్చే జ్వరం వచ్చి హాస్పిటల్లో చేరినప్పుడు, ఆ నర్సు పాపం ఎంతో సహాయం చేసిందనీ. అప్పట్నుంచీ ఆమె తనకు తెలుసనీ, చెప్తూంటే సుగుణ వినిపించుకోకుండా చెవులు మూసేసుకుంది.

'ఇప్పుడు నేనే మున్నాననీ.. మిమ్మల్నీ...' అంటూ మరోహా.. విసురులాంటిది అంది సుగుణ

'నీ పాడు సలహాకి సంతోషించాం కాని. వంట అవుతుందా లేదా?'

'మహారాజులా అవుతుంది.' వంటింటోంచే జవాబు.

"మరి మహారాజు ఆలస్యంగా నిద్ర లేస్తాడు." వాకిట్లోంచి

"కాని పెందలాడే నిద్రపోతాడు" వంటిల్లు..

"చచ్చు జోకు!" బూటు నేలకేసి మెల్ల మెల్లగా కొట్టాడు గోపాలం.

"ఇదో! నేను మీ నాన్నలా ఆర్. టి. సి డ్రయివర్ని కాదు తెలుసా. ఇష్టం వచ్చినప్పుడు బయల్దేరడానికి.. ఇష్టం వచ్చిన చోట ఆపడానికి.. కొన్ని వందల మందిని తీసుకుపోయే రైలుబండి."

"అవును. రైళ్ళు సరిగ్గా పోతవా బస్సులు సరిగ్గా పోతవా అందరికీ తెలుసు మీరేం చెప్పక్కర్లే." టిఫిన్ కారియర్‌తో బయటకి వచ్చిందామె.

కారియర్ అందుకొని ఆ చేత్తోనే ఆమెను దగ్గరకు లాక్కొని, బుగ్గల మీద చిటిక వేసి "సిల్లీ గర్ల్" అనేసి బయటకు పరిగెత్తాడు గోపాలం.

"మళ్లీ ఎన్నిరోజులకి దర్శనం" అన్న ఆమె కేక అతనికి వినిపించ.. 'ఊహూ! కాదు. అతను వినిపించుకోలేదు

పది నిమిషాల్లోపలే స్టేషన్ చేరుకొన్నాడు గోపాలం. వెంటనే తన 'బ్రేక్' లోకి వెళ్లి అంతా చెక్ చేసుకొని ఇంజను వేపు బయల్దేరాడు. మరో ఇరవై నిమిషాలు టయిముంది ఇంకా.. డ్రయివరు రామస్వామి ఎ. ఎస్. ఎమ్. దాసు ఏమిటో జోకు వినినట్లుంది నవ్వేస్తున్నారు..

"గుడ్ మార్నింగ్ గోపాలం గారూ!" అన్నాడు దాసు.

తిరిగి విష్ చేశాడు గోపాలం ఇద్దరికీ.

"రామస్వామీ.. కొంప ముంచెయ్యవు కదా.. పంక్చువాలిటీ వీక్.. నవ్వాడు గోపాలం.

"నీలాంటి గార్డులుంటే కొంపేంగాదు. బండే మునిగిపోతుంది దాసు గారూ! గార్డు మీద ఓ జోకు వింటారా?.." అడిగాడు రామస్వామి.

"చెప్పు గురో! జోకంటే చచ్చేంత ఇష్టం. ఆఫీసుని అడగ్గానే లీవు దొరికినంత సంతోషం."

"గోపాలంలాటి గార్డు ఒకాయన వున్నాడు. ఆయనకీ రైట్ టైమ్ మొదలగు పదాలంటే ఏడీ చావదు. రైట్ టైమ్‌కి పోవడమంటే తెలుగు పిక్చరొకదాన్ని చివ్వరకంటా చూసినంత చిరాకాయనకి. అంచేత శాయశక్తులా పాటుపడి, మిగతా వాళ్లచే పడించి ఎలాగోలా మొత్తానికి లేటుగా.. అదీ ఓ గంట తక్కువ లేకుండా.. తీసుకుపోతూండేవాడు. ఆయనంటే ఆ లైను పాసింజర్లందరికీ పెద్దగురి. ఆయన్ని చూడగానే 'ఈ బండి రయిట్టయిముకు పోతుందా, ఆలీశెంగా పోతుందా అనే సంశయం రక్కున ఎగిరిపోతుంది. అలాంటి గార్డు గారు ఓ రోజున పాసింజరు బండినోదానిని కొన్ని స్టేషన్లలో, రయిట్టయిమూ, చాలా స్టేషన్లలో 'బిఫోర్ టయిమూ' తీసుకు పోతున్నాడని తెలిసిపోయి ప్రతిస్టేషనులో జనం తండోపతండాలుగా వచ్చి చూడసాగారు.

చాలాకాలానికి ఓ రైలుబండీ, అదీ లేటుగా పోవడం బాగా మరిగిన బండీ, ఓ నిమిషం కూడా లేటు లేకుండా పోతోందంటే ప్రజలందరికీ ఆనందం కదు మరి! ఇహను, ఆ బండి టెర్మినేషను స్టేషనులో ఘనసన్మానం ఏర్పాటు చేశారు. ప్లాటుఫారం మీదే ఓ స్టేజీ.. తోరణాలు.. మంగళ వాయిద్యాలూ.. మైకూ, కాకినాడ వారి రికార్డులూ,.. ఓహో ఒకటేమిటి.. బండి ఆగగానే గార్డునీ, డ్రయివరునీ బయటకి లాగి, ఎ. ఎస్. ఎమ్.తో సహా ముగ్గుర్నీ స్టేజి మీద కూర్చోబెట్టి.. మెళ్లో పూలమాలలు నింపేశారు. ఒ తెల్లటోపీ మనిషి లేచి స్పీచ్ మొదలెట్టేశాడు.

"సోదరులారా! ఇన్నాళ్లకు మన గార్డుగారు శ్రమకోర్చి ఈ బండి రైట్ టైమ్‌కి ఇవాళ ఇక్కడికి తీసుకొచ్చారు..."

"ఇది.. ఇవాల్టి.." గార్డుగారు నోరు మెదపబోయాడు.

"ఫరవా లేదన్నాడు" ఆ తెల్లటోపి, ఆయన..

"అదికాదు..ఈ బండి.."

"దట్సాల్ రైట్" అన్నాడాయన వినకుండానే.

"నన్ను మాట్లాడనీండ్రోయ్. ఇది ఇవాల్టి బండికాదు.."

"తెలుసులేవయ్యా! అందరికీ తెలుసు! అయినా మాత్రం.. గొప్ప కాదుటండీ బండి నిన్నటిదే ఔగాక..కాని ఇవాల్టి కల్లా వచ్చిందంటే.."

"అవూనూ." అన్నారు జనమందరూ.

"ఇది." మళ్లీ గొణిగాడు గార్డు

అంతా నిశ్శబ్దం!

"ఇది మొన్నటిది.."

వెంకటదాసు నవ్వేస్తున్నాడు. "అబ్బ! ఏం జోకావయ్యా..నీ ఇంజను బంగారం గానూ! నీ బండి రైట్ టైమ్ పోనూ!..."

ఆఫీసు నుంచి వచ్చే ఛార్జిషీటుల్లా గోపాలానికి ఉక్రోషం పెరిగిపోయింది.

"ఏడ్చినట్లుంది వెధవ జోకు.."అన్నాడు

"డ్రయివరు ఎవడో నీ లాంటివాడే!" అని కూడా అన్నాడు. అనేసి పరుగెత్తుకుంటూ తన బ్రేకు దగ్గరకు వెళ్లిపోయాడు. టయిమవగానే సిగ్నలు చెక్కావంగింది వెంటనే విజిల్ వేసి పచ్చజెండా చూపించాడు గోపాలం కెవ్వున కూత వేసింది ఇంజను. బండి కదిలింది.

"హమ్మయ్య!" అనుకొన్నాడు గోపాలం.

మూడు స్టేషన్ల వరకూ ఆగదు బండీ.. నాలుగో స్టేషన్లో ఆగింది.

'ఓ నిమిషం ముందే వచ్చిందండోయ్. మీ బండి!" అన్నాడు ఎ. ఎస్. ఎమ్ ప్రభాకర్.

"అవును గురో! పంక్చువాలిటీ వీక్ కదా! దంచేస్తున్నాడు రామస్వామి.. అన్నట్టు. తిరుపతి పోతానన్నావ్ గదూ.. పోలేదా?"

"ఎక్కడ సార్! రెండేళ్ల నుంచీ అడుగుతున్నా ఇంతవరకూ రిలీఫ్ పంపలేదు. వెనుకటికి ఓ కొత్తగా పెళ్లయిన ఎ. ఎస్. ఎమ్ అత్తారింటికి పోడానికి, ఎంతకీ రిలీఫ్ దొరక్క విసిగిపోయి 'ఎ. ఎస్ ఎమ్ డైడ్. ఎరేంజ్ రిలీఫ్' అని టెలిగ్రాం ఇస్తే.., "లెట్ హిమ్ వెయిట్. నో రిలీఫ్" అని రిప్లై వచ్చిందట. అలా వున్నయి మా బతుకులు..అదిసరే. స్టార్టు చెయ్యండి సార్.. టైమయింది.."

మళ్లీ బండి కదిలింది.

మరో నాలుగు స్టేషన్లలో ఆగకుండానే పరుగెత్తింది బండి అయిదో స్టేషన్లో ఆగుతూనే పరుగెత్తుకు వచ్చాడు అక్కడి పార్సిల్ క్లర్క్.

"పార్సిల్ లోడింగ్ వుంది సార్."

"ఎన్ని పాకేజెస్?"

"యాభై ఉన్నయ్యండి!"

"ఘంపావయ్యా.. ఇక్కడ.. బండి హాల్టు మూడు నిమిషాలు..ఆ బిగుసుకు పోయిన తలుపులు తెరవడానికే అయిదు నిమిషాలు పడుతుంది. ఏం చేద్దామంటావ్?"

"అరగంట అయినా సరేనండీ. లోడ్ అవ్వాల్సిందే.. నాలుగురోజుల క్రితమే పార్సిల్స్ క్విక్ డెస్పాచ్ లేదని లవ్ లెటర్ వొచ్చింది ఆఫీసు నుంచి. పైగా ఇది పెరిషబుల్స్.. ఇవి బుక్ చేసిన మర్చెంటుకి ఈ వూరి ఎమ్. పి. గారికీ మాంచి స్నేహం. ఇవి ఏమాత్రం పాడయినా ఈ సంగతి పార్లమెంటులో పడేసి, మనిద్దరినీ సస్పెండు కేయించేస్తారు..."

అంతా పూర్తయేసరికి పదిహేను నిమిషాలు పట్టింది..

బండి కదిలేప్పటికి గోపాలం టైమ్ చూసుకుంటే పధ్నాలుగు నిమిషాలు లేటు వుంచి బండి.

# గార్డు గోపాలం

యాభై నిమిషాలు తరువాత మరో స్టేషనులో ఆగింది బండి. రెండు నిమిషాలయిన తరువాత విజిల్ వేసి పచ్చజెండా చూపబోయాడు గోపాలం.

"వన్ మినిట్ సర్. నా ఫామిలీకి ఇక్కడి నుంచీ ఫస్ట్‌క్లాస్ రిజర్వేషన్ వుంది. కాని అందులో వేరెవరో కూర్చున్నారు. వెకేట్ చెయ్యనంటున్నాడు." ఓ పెద్దమనిషి,

"అదిగో అక్కడ టి. టి. ఇ. వున్నాడండి మాష్టారూ! ఆయనకు చెప్పండి!" చిరాకేసు కొచ్చింది గోపాలానికి.

పెద్దమనిషి వెళ్లాడు. టి. టి. ఇ. ఫస్టుక్లాస్ కంపార్ట్‌మెంట్‌లోని వ్యక్తితో ఓ చిన్నసైజు యుద్ధం చేశాక ఆయన అది ఖాళీ చేశాడు. ఇదంతా అయి బండి కదిలేప్పటికి మరో ఎనిమిది నిమిషాలు మేకప్ అయింది. బోలెడు స్టేషన్లు దాటిపోతున్నాయి. టైము కూడా అయిదు నిమిషాలు మేకప్ అయిపోయింది. నిలవేస్తాడనుకున్న అప్పులాడు తన్ని చూడకుండానే వెళ్లిపోయినంత సంతోషం కలిగింది గోపాలానికి. మరో రెండు స్టేషన్లు మాత్రమే వున్నాయి తను డ్యూటీ మారిపోవడానికి

వాక్యూమ్ మీద ముల్లు ముందుకీ వెనక్కూ వూగింది.

"క్గ్.." అంటూ బ్రేకులు పట్టుకొన్నాయి. గోపాలానికి వళ్లు మండిపోయింది. ఎవరో చైన్ లాగారు. బ్రేకు దిగి ముందుకు నడిచాడు గోపాలం. రెండో పెట్టెలోనే గొలుసు లాగారు. బాగా రద్దీగా వుంది పెట్టెలో.

"ఏమిటయింది?" అడిగాడు గోపాలం కిటికీలోంచి బయటకు చూస్తూన్న ఓ బుష్‌కోటుని

"ఆ! ఇప్పుడేముంది సార్! అంతా అయిపోయింది. ఒక్కపది నిమిషాలు ముందు



చూడాల్సింది మీరు. పెద్ద వార్ జరిగింది సార్. అటు ప్రక్క అయిదుగురు పాండవులూ, ఇటు ప్రక్క ఇద్దరు కౌరవులూ, చచ్చేట్లు కొట్టుకొన్నారు. ఆవిడె వరో భయపడి గొలుసు లాగేసింది. ఇప్పుడేంలేదు లెండి సార్! అంతా సర్దేశాం."

గోపాలం తిరిగి వస్తూంటే ప్రక్క పెట్లోంచి ఓ స్టూడెంట్ వేళాకోళంగా అడిగాడు "ఏంసార్. ఏమయిందీ? యాక్సిడెంట్ కాదు గదా?"

"యాక్సిడెంటయితే నువ్విలా మాట్లాడ టానికి మిగుల్తావా బాబూ!" కోపంగా అన్నాడు గోపాలం.

"కోపమెందుకు సార్! క్రొత్తేముంది కనుక! పేపర్లో రోజుకో రెండు రైళ్లు ఢుద్దెట్టుకొనే ఫోటోలు రావడం లేదేమిటి"

'ప్రస్తుతం రైల్వేలు జనాన్ని ఎక్స్పోర్టు చేస్తున్నయిరా. ఫామిలీ ప్లానింగ్ కన్నా ఇది బెటర్ రిజల్ట్సు ఇస్తోంది!' అన్నాడు, టెర్లిన్‌షర్టు కుర్రాడు

కాని అవి వినేందుకు గోపాలం అక్కడ లేడు.

బండి కదిలింది..మళ్లీ.. ఆఖరుసారి..

కాని ఈ సారి రామస్వామి స్పీడు దంచ లేకపోతున్నాడు.

గ్రేడియంట్ మరి..

జంక్షన్ స్టేషన్ చేరుకొనేప్పటికి బండి ఇరవై అయిదు నిమిషాలు లేటు అయింది.

ఎ. ఎస్. ఎమ్. వచ్చాడు "ఏం సార్! మీ బండి గురించి రెండు కనెక్టింగ్, ట్రైన్స్ దెబ్బతిన్నయి. అన్నట్లు మీకో కంట్రోల్ మెసేజ్ వుంది. మిమ్మల్ని ఆఫీసుకి 'బుక్' చేశారు బండీ లేటు అయి నందుకు."

బ్రేక్ దిగి మెల్లగా నడిచాడు గోపాలం.

'సుగుణతో అనవసరంగా పోట్లాడాను" అని రెండు మూడు సార్లనుకొన్నాడు. ●



వైజ్ఞానిక గాథావళి-73

# వెల్తురు తత్త్వము

క్రిస్టియాన్ హైగెన్స్

-డాక్టర్-

వెల్తురు తత్త్వమును గురించి న్యూటను ఆలోచించాడు. గమనిస్తుండే ఘన పదార్థాలు ఇతర ప్రభావాలు గాని వాటి మీద పనిచేయక పోతే బుజురేఖలో ప్రయాణిస్తాయని అతడు తుర్తించాడు ఒకటి. వెల్తురు బుజురేఖలోనే ప్రయాణిస్తుంది. (మబ్బుల వెనక నుండి వెల్తురు ధారలూ, ఇంటి కప్పులోంచి చీకటి గదిలో ప్రవేశించే వెల్తురు కిరణమూ, బుజురేఖలోనే గదా ప్రసరించేది?) బంతుల్ని గోడకిగానీ నేలకు గానీ కోణములో కొట్టితే అవి తూలిన విధము గానే, వెల్తురు అద్దాల మీద పడినప్పుడు తూలుతుంది రెండూ. కనుక "వెల్తురంటే కంటికి కనబడని సూక్ష్మాతి సూక్ష్మ కణముల జల్లు, ఇది వెలిగే వస్తువు నుండి బయలుదేరి, తూలి తూలి కంటికి చేరుతుంది." అన్నాడు న్యూటన్ను. ఈ అభిప్రాయాన్నే ప్రస్తరించి "గాజు పలక—, నీరు—, మీద వెల్తురు వాలుగా పడితే, వెల్తురు కణాలను ఆ వస్తువుల కణాలు గురుత్వాకర్షణ శక్తి వల్ల దిగలాగడము వల్లనే, నీటిలో దారి బడే వెల్తురు కిరణాల వాలు ఎక్కువవుతుంది" అని కూడా అన్నాడు.

నెదర్లాండ్సు విజ్ఞాని హైగెన్సు మరోకలాగు చెప్పేడు. "రెండు వెల్తురు కిరణాలు ఒకదానిని ఒకటి దాటినా వాటి రెండింటి లోనూ ఏ విధమైన ఘట్టన చిహ్నాలూ కనబడవు. అయితే వెల్తురు మన కంటి వెనక (రెటీనా తెర) మీద పడితే తప్ప తెలియరానిదీ, ఏదో గమనమూ మాత్రమేను వెల్తురు ప్రసరించే వేగాన్ని బట్టి వూహిస్తే, అది వెలిగే వస్తువు నుంచి వచ్చే వస్తువుననే మాత్రమని పించదు. అయి నట్లయితే బాణాలు ఢీకున్నట్లు ఢీకొనవద్దా వెల్తురు కణాలు?" అన్నాడు.

పటములోది గుండ్రని పెద్ద పళ్లెము, నీటితో వుంది. 'ప', 'ల' అన్నవి గాజు పలకలు, నిలువుగా పట్టుకున్నాము పళ్లెములో. చుక్కవున్న చోట ఒక నీటి చుక్కని రాల్చాము. వర్తులాకారంగా తరంగము వ్యాపిస్తుంది. గుండ్రని గీతలు ఆ తరంగము యొక్క వేర్వేరు స్థితులు. 'ప' 'ల' ల మధ్య ఖాళీ దగ్గరకు వచ్చిన తర్వాత, ఆ ఖాళీకి బయిటి నీటిలో తరంగపు తాకిడి ఏ రీతిగా వ్యాపిస్తుందీ? చుక్క దగ్గర నుంచి చిన్న చీపురు పుడక తుపాకీ 'ప' 'ల' ల మధ్య ఖాళీలలోంచి గుండ్లు పేలిస్తే అవి 'సి' 'డ' ల మధ్యనే వుంటాయి గాని 'గి' 'గి' అన్న గీట్లకు తాకవు. ఇప్పుడు చుక్క దగ్గర వెల్తురిచ్చే వస్తువున్నదనుకోండి. 'ప' 'ల' అన్నవి లోహపు పలకలు. నడిమి ఖాళీ ఇంకా సన్నమైంది అనుకోండి. వెల్తురన్నది న్యూటను చెప్పినట్లు కణ వర్షమే అయితే, 'గి—గి' అన్న చోట్లకాదుగదా, 'సి' 'డ' గీతలకు ఏపాటి వెలపలకు అయినా చుక్క దగ్గరి వెల్తురు చేరలేదు. 'డ' నుంచి 'ల' వరకూనూ, 'సి' నుంచి 'ప' వరకూనూ నీడలు. కణాలయితే నీడలలోకి చేరలేవు. చుక్క దగ్గర తరంగము గాని బయల్దేరితే, 'ప' 'ల' ల ఖాళీ దగ్గర మళ్లీ తరంగము బయల్దేరినట్లుగా వర్తులము గానే వ్యాపించి 'గి గి'—అన్న గీట్ల దగ్గరకు కూడా వ్యాపిస్తుంది. సోదా చూడవచ్చును. అంటే ఏమన్న మాటా? — తరంగానికి అడ్డు వచ్చినప్పుడు ఆ అడ్డు కొననే మళ్లీ ఉపతరంగము బయిలు దేరి — ఆఅడ్డు అసలు తరంగానికి ఏర్పరచిన — నీడ లోనికి కూడా వ్యాపించ గలదు అన్న మాట. ఏతా వాతా తేలినదిది: చుక్క దగ్గర బయలుదేరినవి వెల్తురు కణములే అయితే, నీడ లోనికి ఏ కొంచమూ కూడా కనిపించదు. ఆ వెల్తురే, తరంగము అయితే నీడలోకి కూడా కనిపిస్తుంది ఏ కొంతో. నీడలోకి ఏ కొంచెమో కనిపిస్తే వెల్తురన్నది తరంగము. కనిపించకపోతే వెల్తురు 'కణముల వర్షము'.

ప్రయోగ సాక్ష్యము వెల్తురుని తరంగమే అని నిరూపించింది. ఆ సాక్ష్యమును ఇక్కడ వివరించలేను గాని ఒక నిదర్శనము ఇస్తాను. దూరం నుంచి వచ్చే మోటారు హెడ్ లైట్లకు రోడ్డు మీద మనవైపు వచ్చే వారి తలలు అడ్డువస్తాయనుకోండి. అప్పుడు మీ కళ్లు ఆ వెల్తురుకు ఆ తల కల్పించిన నీడలో ఉన్నాయన్న మాట. అయినా, మీకు ఆ తల చుట్టూ నుంచి వెలుగు అందుతుంది! ఆ జుట్టు వెలుగు తూస్నట్టు మెరుస్తుంది! నీడలోకి వెల్తురు ఏ కొద్దో వ్యాపిస్తోంది అన్న మాట. వెల్తురు తరంగమే! కణముల వర్షము కాదు.

శబ్దము కూడా తరంగమే. మనము రోడ్డు మీద పోతూంటే మేడలలో గదులలోని కేకలు మనకే వినబడతాయి. ఆ మాటల వల్ల మేడ గది మధ్యన ఎక్కడో పుట్టిన తరంగము ఆ గది కిటికీ దాకా వ్యాపించి, ఆ కిటికీ ఖాళీలో ఉపతరంగము పుట్టి మన చెవుల దగ్గరకు వ్యాపించి అందిన దన్న మాట. శబ్దము చిన్న చిన్న కణముల చిమ్మడము లాటిదే అయితే ఆ పై కిటికీలోంచి మనకు దిగువకు ఎలాగ అందిందీ?

శబ్ద తరంగము గాలిలోనూ నీటిలోనూ ఘన పదార్థము లోనూ వ్యాపిస్తుంది. (వట్టి ఆకాశములో శబ్దాలు ప్రసరించవు. ఆకాశము శబ్దగుణక మన్న మాట తప్పు). మరి వెల్తురో? తరంగము అనగానే పైకి కిందికీ వూగగల నీటి వంటి వాహకము కావాలి అనిపిస్తుంది. మరి సూర్యుడికీ మనకీ మధ్యన —, నక్షత్రాలకీ మనకీ మధ్యనా వెల్తురు తరంగాల్ని వహించుకు తెచ్చేది ఏముంది? 'ఈథరు' అనేశారు. అదిటూ, ఉక్కు కన్నా ఎక్కువ స్థితి స్థాపక శక్తి గలిగినదటా, దానిలోంచి మట్టుకు భూమ్యాది గ్రహాలు ఏపాటి విరోధము లేకుండా తమ ప్రదక్షిణాలు చేసుకుంటాయిట! అయితే ఇది నిశ్చయమా? వెల్తురు తరంగ గమనము కావడము నిశ్చయము. మిగిలినది తదనుకూలపు టూహ. వెల్తురు ఈథరులో ప్రయాణించే తరంగముట. ●

# వాటర్‌బరీస్ కాంపౌండ్

ఎఱ్ఱ లేబిలు

## త్రాగి జలుబును ఎదుర్కోండి










మామూలుదని భావించే జలుబు మరొక రోగమును ఎదుర్కొనే శక్తిని పోగొట్టుతుంది. దేహమును బలహీన పరచి రోగములు కలిగే అవకాశమును కలిగిస్తుంది. వాటర్‌బరీస్ కాంపౌండ్ యొక్క విశిష్టమైన త్రివిధ క్రియ ఉపశమనమును కలిగిస్తుంది, మళ్ళీ సత్తువనిస్తుంది మరియు రోగనిరోధక శక్తిని హెచ్చుచేస్తుంది. దానిలోని ముఖ్యంగా పనిచేసే క్రియోసోట్ మరియు గయికోల్ జలుబునుండి ఉపశమనము కలిగించును; దానిలో చేరే ఇనుముయొక్క సత్తువ మరియు బలవర్ధక పదార్థములు, మాల్ట్ మరియు ప్లీహ సారములు ఆకలిని పుట్టించును. కోల్పోయిన శక్తిని భర్తీచేయును. రోగము మళ్ళీ రాకుండా ఉండేలా రోగనిరోధక శక్తిని కలిగించును.

ఏ శీతోష్ణస్థితిలోనైనా రోగనిరోధక శక్తికి - ఎఱ్ఱ లేబిలు గల వాటర్‌బరీస్ కాంపౌండ్ త్రాగండి.

వాటర్‌బరీస్ కాంపౌండ్‌లోగల క్రియోసోట మరియు గయికోల్ కఫమును విడదీసి ఉమ్మిలో పోయేలాచేయును మరియు సూక్ష్మజీవుల అడ్డును. అవి ఊపిరితిత్తులను ఉత్తేజ పరచును, దగ్గు, జలుబు, ఉబ్బసపు అసౌఖ్యము, శ్వాస నాళపు అస్వస్థతలను పోగొట్టుటలో సహకరించును మరియు రోగములు మళ్ళీ రాకుండా చేయును.

# వాటర్‌బరీస్ కాంపౌండ్

**దగ్గు, జలుబు, శ్వాసనాళపు అస్వస్థతలు, ఉబ్బసపు అసౌఖ్యములను నివారించుటకు శక్తిని కలిగించును**

వార్నర్ - హిందూస్తాన్ లిమిటెడ్ - బొంబాయి.

WWHL 24




మురళి జ్యోతిర్మయి కొక సమస్యగా తయారైనాడు. ఎటు నుంచీ ఎటు చూసినా ప్రశ్నార్థకం దగ్గరకే వచ్చి ఆగి పోతుంది ఆమె ఆలోచన. అతన్ని పూర్తిగా అర్థం చేసుకోవాలని ప్రయత్నిస్తున్న కొద్దీ విడని చిక్కుముడిలా కనిపిస్తున్నాడతను.

సమస్యల మీద వో పెద్ద 'ట్రీటైజు' రాయగలవాడు మురళి! అతని మాటల్లో, చేతల్లో సమస్యలు పరిష్కార మవుతూ వుంటాయంటాడు.

అలాంటి మురళీ జోతిర్మయి కొక సమస్యగా తయారైనాడు!

క్రితం సాయంత్రం పబ్లిక్‌గార్డెన్‌లో అతనిచ్చిన ఉపన్యాసం తాలూకు పతాక శీర్షికలు కొన్ని గుర్తుకొచ్చేయి జ్యోతిర్మయికి.

అతనంటాడు, "వివాహాన్ని గురించి కొన్ని నిశ్చితమైన అభిప్రాయాల్ని పెంచుకోవాలి— ఈ కాలపు యువతీ యువకులు. సంఘ సంస్కరణలంటూ గొంతు చించుకోక, తమచేతనైన విధంగా సంఘ దురన్యాయాల్ని రూపు మాపాలి. ఉదాహరణకి నన్ను తీసుకోండి. నేనొక కోటీశ్వరుడికి దత్తపుత్రుణ్ణి. ఆ వైపు నుంచీ నాకొక మరదలుంది. ఆమెను పెళ్ళాడమని మావాళ్ళందరి ఒత్తిడి. నాకది సుతరామూ ఇష్టం లేదు. ఎందుకనో తెలుసా? — నాలుగు తరాలకి సరిపోను వాళ్ళకీ వుంది ఆస్తి. అంతే. నేను డబ్బు జెంగలేనివాణ్ణి కనుక, వో చక్కటి బీదయింటి పిల్లను పెళ్ళాడతాను. దీని వల్ల భవిష్యత్తులో ఎంతో మేలు జరుగుతుంది. నాలా కొంత మంది ధైర్యం చేయగలిగితే, సమాజ వ్యవస్థ పూర్తిగా మారి పోతుంది మనం ఆశిస్తున్న 'సోషలిష్టిక్ పాటర్న్ ఆఫ్ సొసైటీ'ని నిర్మించటానికి ఎంతో కాలం పట్టదు." అని.

ఇలాంటి ఆశయాల్ని వ్యక్తంచేస్తూ, తనకు సన్నిహితుడవుతున్న మురళే జ్యోతిర్మయి కొక సమస్యగా, విడని చిక్కుముడిగా కనిపిస్తున్నాడు!

క్రితం సాయంత్రం అంతటి దృఢమైన అభిప్రాయాల్ని వ్యక్తీకరించిన మురళీ, ఈ వేళ మరొక వార్త తీసుకొచ్చేడు. పైడిరాజు అని అతనికొక మిత్రుడున్నాడు. అతనూ యితనిలా, పుట్టూ కూడా ఏడుపు లేకుండా పుట్టిన ఘనుడట! ఇతగాడు కోటికి వారసుడైతే, అతగాడొక పది కోట్లకు వారసుట్ట! అలాంటి పైడిరాజు ప్రేమించి పెళ్ళి చేసుకున్నాడు.

మురళికి మహదానందాన్ని కలిగించిన వార్త! అయితే, వివరాలు తెలుసుకుని చిరాకుపడి, అతన్ని అసహ్యించుకుని లో లోపల తిట్టుకున్నాడు మురళి. దానికి కారణం పైడిరాజు ప్రేమించి పెళ్ళాడిన యువతి — వో అతిబీద పిల్ల కావటం మాత్రమే కాదు, కాస్త అనాకారి కావటం! పైడిరాజు పంపిన పెళ్ళి ఫోటో జ్యోతిర్మయికి చూపి, "ఇలాంటి అనాకారి పిల్లని పెళ్ళాడతాడని కలలో కూడా అనుకోలేదు. మరీ గుడ్డివాడై పోయాడు— వీడి ప్రేమా, వీడూ పాడుగానూ!" అన్నాడు మురళి.

మురళి చుట్టూ తాను అల్లు

కుంటున్న నమ్మకాల గూడు చెదిరింది జ్యోతిర్మయికి. అతని భావాన్ని తన కన్వయించుకుని విమర్శించు కోవటం ప్రారంభించింది. తాను బీద యింటిది, పెద్ద అందగత్తె కాదు. మరి, మురళి తన నాకర్షించటాని కెందుకు ప్రయ త్నిస్తున్నట్టు?

వారం రోజుల క్రితమూ అతని లాంటి పరస్పర విరుద్ధమైన రెండు అభిప్రాయాల్ని తనకు తెలియ జేసేడు. ఆవేళ తానూ, అతనూ కలిసి బజారున వస్తున్నారు. మురళి వున్నట్టుండి ఒక అమ్మాయిని చూపి, "ఆమె మా ఆఫీసు లోనే పనిచేస్తున్నది. ఆడవాళ్ళు ఉద్యో గాలు చేయటంలో తప్పులేక పోయినా, బరితెగించి పదిమందిలో తేలిగ్గా మారటం మాత్రం నాకు నచ్చదు. అంటే, నే చెప్పొచ్చే దేవిటంటే, 'కారెక్టర్' గురించి" అని ఆ ప్రసంగాన్ని త్రుంచే శాడు.

మురళి మాటలు తనలో పెద్ద సంచలనాన్ని కలిగించాయి. తనూ ఉద్యోగం చేస్తున్న ఆడది. అందువల్ల పదిమందితో కలిసి మెలిసి వుండటం తప్పదు. అంత మాత్రానికే 'కారెక్టర్'ని గురించి వూహా గానం ప్రారంభిస్తే? — తానెలా నమ్మించ గలదు, తన నైర్మల్యాన్ని గురించి!

జ్యోతిర్మయి అసహనంగా కుర్చీలో అటూ యిటూ జరిగింది. ఉన్నట్టుండి ఆమెకొక ప్రశ్న ఎదురైంది— అసలు మురళిని గురించి తానెందుకింతగా ఆలో చించాలి?

క్షణాల్లో ఆమె పెదవుల మీద సన్నని నవ్వు విరిసింది. బుగ్గలు సిగ్గుతో ఎరుపెక్కి, ముఖం సంతోషంతో ప్రఫుల్లమైంది. ఉత్సాహంగా లేచి, మంచం మీదికి దూకింది. మరి కొంత సేపటికి, ఆమె నేవేవో తీయటి కలలు చుట్టేసినై!

—బయటి తలుపు శబ్దం కావటంతో ఉలిక్కి పడి లేచింది, జ్యోతిర్మయి. తలు పును ఎవరో కొట్టుతున్నారు. విసుగ్గా మంచం దిగి లైట్ వేసింది. టేబుల్ మీది టైంపీస్ పదకొండూ పది నిము షాలు చూపుతోంది. సందేహంగానే వెళ్ళి తలుపు తీసింది.

ఎదురుగా మురళి!

జ్యోతిర్మయి ఆశ్చర్య పోయింది. అంతలోనే తేరుకుని, లోపలికి నడుస్తూ "రండి" అంది.

మురళి భారంగా అడుగులు వేస్తూ వచ్చి కుర్చీలో కూర్చున్నాడు.

"ఏమిటి యింత రాత్రి వేళ హఠా త్తుగా......"

జ్యోతిర్మయి మాటల్ని మధ్యలోనే త్రుంచేస్తూ అన్నాడు మురళి, "రావా ల్సొచ్చింది. ఇక్కణ్ణుంచి యింటికి వెళ్ళానా? నే వెళ్ళేసరికి, అమ్మా నాన్నా కూర్చుని నా పెళ్ళి గురించి మాట్లాడు కుంటున్నారు. సమయానికి వెళ్ళటంతో నా అభిప్రాయాన్ని తెల్పి చెప్పమని నిల వేసేరు. ఒక్క రోజు గడువడిగి ఇలా వచ్చాను."

జ్యోతిర్మయి మౌనం వహించింది. మురళి వ్యక్తిత్వాన్ని గురించి తను పూర్తిగా అవగాహన చేసుకోకుండా ఏ నిశ్చయానికి రాగలదు?

క్షణాల తర్వాత మురళే అడిగేడు, "నా భవిష్యత్తిప్పుడు నీ మీద ఆధార పడి వుంది, జ్యోతీ. నీ నిర్ణయం నా కనుకూలంగా వుంటుందనే ఆశతో గాలి పీలుస్తున్న వాణ్ణి నేను. అయితే, ఒక్క విషయం మాత్రం నేను నీకు తెల్పి చెప్పాలి."

జ్యోతిర్మయి ఉత్సుకతతో అతని మొహంలోకి చూసింది.

"నేనొక పెద్ద కోటీశ్వరుణ్ణ గదా అనే సందేహాన్ని మాత్రం నీ మనస్సులో వుంచుకోకు. ఆ అంతరం వల్ల నీ మన సెనాడూ నొప్పించనని మాటివ్వ గలను. ఇక, మా తమ్ముడూ, చెల్లెళ్ళని గురించి నీ కెంత బాధ్యత వుందో, నాకూ అంతే వున్నట్టు భావిస్తాను. వాళ్ళిద్దరికీ ఏ లోపం రాకుండా చూసుకోగలం మనం. నీ కింకేమైనా అనుమానాలుంటే అడుగు."

మురళి చెప్పినదంతా వూపిరి బిగ పట్టి విన్నది జ్యోతిర్మయి. అప్రయ త్నంగా, ప్రక్కనే పడుకునివున్న తమ్ముడూ చెల్లెలు మీదకి మళ్ళినై ఆమె చూపులు.

క్షణాలు నిశ్శబ్దంలో దొర్లిపో తున్నాయి. జ్యోతిర్మయి మనస్సులో అనేక ప్రశ్నలు పుట్టి చెదరి పోతు న్నాయి. మురళి ఆమె వైపు చూస్తూ వుండి పోయేడు.

కొద్ది సేపటికి గొంతు పెగల్చుకుని అంది, జ్యోతిర్మయి "నన్నూ ఆలో చించుకో నివ్వండి" అని.

"అలాగే...... ఉదయాన్నే వస్తాను" అంటూ వెళ్ళి పోయేడు మురళి.

మంచం మీద పడుకున్న జ్యోతి ర్మయికి ఎన్నెన్నో ఆలోచనలు కలిగేయి. నిర్దుష్టమైన అభిప్రాయాలు లేక, పేల పిండిలా గాలికి కొట్టుకుపోయే ఆశ యాలతో, డాంబికానికి పది మాటలు మాట్లాడటం నేర్చిన మురళి— తన గత చరిత్ర వింటే— నిజంగా తనను ప్రే మించి పెళ్ళాడ గలడా?

వ్యక్తిగత సంస్కారం మీద సమస్యల పరిష్కారాలు ఆధారపడి వుంటాయని వాదించే మురళి— ఈ సమస్య కొక పరిష్కారం చూపి, తన నిశ్చయాన్ని, ప్రేమను మార్చుకోకుండా వుంటాడా?

తమ్ముడు, చెల్లెళ్ళను గురించి తనకు ధైర్యం చెప్తున్న మురళి, వాళ్ళను తన వాళ్ళుగా చూసుకో గలడా? వీటన్నిటికీ మించి, తమ పిల్లను కాదని తనను చేసు కున్న మురళిని అతని తల్లిదండ్రులు క్షమిస్తారా? క్షమించినా, తనను ఆద రిస్తారని నమ్మక మేమిటి?

కన్న వారి ప్రేమకు, ఆదరణకే నోచు కోని తను పరుల ఆదరణని ఆశించటం ఎండమావిలో నీళ్ళున్నవని భ్రమించటమే అవుతుంది!

జ్యోతిర్మయికి కళ్ళు చెమ్మగిలినై. పైట కొంగుతో కళ్ళు తుడుచుకుని ప్రక్కకు తిరిగింది. 'ట్రాన్స్ ఫార్మర్' వెలుతురు గోడల మీద చిత్ర విచిత్ర మైన వెలుగు నీడల్ని సృష్టిస్తోంది. గతమంతా దృశ్యరూపంగా గోచరించ సాగింది జ్యోతిర్మయికి!

బీదవాళ్ళింట్లో పెద్ద కూతురుగా పుట్టటం మహాపాప ఫలమని తొలిసారిగా అనిపించింది తనకు ఆ రోజుల్లో. ఏడవ కాన్పుకు సిద్ధమవుతున్న తల్లి ఇంటెడు చాకిరీ తనకే అంటగట్టగి— శరీరంలో శక్తి ఉడిగి పోవటం వల్ల పదమూడవ ఏటనే బ్రతుకులో బరువు బాధ్యతల్ని నెత్తిన పెట్టుకుని, ఇంటి

(ని పూర్తిచేసి స్కూలుకు వెళ్ళి చదువుకో వలసి వచ్చింది. కన్న తల్లికి ప్రేమ, ఆదరణా లేకపోయినా, పిల్లల్ని పెంచాలనే తపన, వాళ్ళ సంరక్షణ ఎలా గడుస్తుందా అనే తాపత్రయమన్నా వుండేవి. నాన్నకి అవీలేవు. ఏవేవో మూలికలనీ, మందులనీ అక్కడక్కడా తిరగటం ఎప్పుడో యింటికి వచ్చి వెళ్తూ వుండటం, కుటుంబ బాధ్యత ఏనాడూ లేదాయనకు.

సంవత్సరాని కొచ్చే పది బస్తాల ధాన్యంతో తిన్న వాడు తినీ, లేనినాడు లేకా రోజులు వెళ్ళబుచ్చటం అలవాటు అయిపోయింది. ఉన్నట్టుండి పిడుగు లాంటి వార్త తెలిసింది తను కోరోజున. నాన్న సన్యాసుల్లో కలిసి పోయాడు! కాషాయ వస్త్రాలు కట్టుకుని ఔషధాలు తయారు చేయటం కోసం ఎక్కడో ప్రయత్నాలు చేస్తున్నాడని విన్నరోజున అమ్మా, తనూ కుమిలి పోయారు. భార్య అనుమతి లేకుండా సన్యాస మేమిటో?—తండ్రంటే అసహ్యం వేసిన మాటనిజం తనకు. పెళ్ళాం బిడ్డల్ని వాళ్ళ కర్మకు వాళ్ళను వదలి తప్పించుకు పోయేందుకు వుపయోగించిందా, సన్యాసమని పించింది. బాధ్యతారహితంగా ప్రవర్తించే అలాంటి వాళ్ళని ఏ కఠిన శిక్షకు గురిచేస్తే బాగుంటుంది?—

ఉండలేని వాడయి పోయాడు నాన్న. అమ్మ లేకుండానే పోయింది, మరో దురదృష్టి జీవిని భూమి మీద వదలకుండానే. దైవం లాంటి మావయ్య సంరక్షణలో తన కాళ్ళ మీద తాము నిలవ గలిగే స్థితి కొచ్చింది తను. పల్లెత్తుమాటన కుండా, కష్టమో నిష్ఠూరమో భరించి ఐదేళ్ళు పోషించిన మావయ్య, అత్తయ్యల ఋణం జన్మ జన్మలకూ తీర్చుకో లేనిది.

ఉద్యోగం దొరికి ఈవూరు వచ్చేనాడు—

మావయ్య సలహా యిచ్చాడు, "పెద్ద పిల్లల్నిద్దర్నీ తీసుకు వెళ్ళి చదువు చెప్పించుకో. నీకూ ధైర్యంగా వుంటుంది. తోడుగా వుంటారు. మిగిలిన ముగ్గురూ ఇలాగే ఇక్కడుంటారు."

నీళ్ళు నిండిన కళ్ళతో అత్తయ్యకు, మావయ్యకూ నమస్కరించి వచ్చేసింది.

దృశ్యం తెగింది. జ్యోతిర్మయి ఈ శోకంతో పడింది,

# అద్దం తిరిగిన కథ

ప్రక్కన చూస్తే, రమణి! జ్యోతిర్మయి ఆశ్చర్య పడింది. తన భుజం మీద చెయి వేసి జాలి చూపులు చూస్తోంది చెల్లెలు. "ఎప్పుడు లేచావే?" అంది జ్యోతిర్మయి.

అక్క ప్రశ్నకు సమాధానం చెప్ప కుండానే, "ఎన్నాళ్ళిలా ఆలోచిస్తూ మనసు పాడుచేసుకుంటా వక్కా? మన మిక్కడికి వచ్చేటప్పుడు మావయ్యన్న మాటలు గుర్తు తెచ్చుకుని ఒక నిశ్చయాని కొచ్చెయ్" అంది రమణి.

జ్యోతిర్మయి నివ్వెర పోయింది. అయితే, రమణికి అన్నీ తెలుసన్నమాట. ఇప్పుడు తనకూ మురళికీ జరిగిన సంభాషణ కూడా వినే వుంటుంది. 'అవును, ప్రాయకం తెలిసి బి. యే. చదువుతున్న పిల్ల. మంచీ చెడూ తెలియకుండా ఎలా వుంటుంది' అనిపించింది. తను హైదరాబాద్ వచ్చేటప్పుడు కడసారిగా మావయ్య అన్న మాటల్ని మననం చేసుకుంది జ్యోతిర్మయి.

"గతంలో జరిగి పోయిన దానికే నే నెంతగానో కుమిలి పోతున్నాను. భవిష్యత్తులో కూడా నిన్నిలా చూడలేను. త్వరలోనే నువ్వొక యింటి దాని వైతే, నాకంటే సంతోషించే వారుండరు. అన్నీ తెలిసిన దానివి, ఆలోచించి నిర్ణయించుకో"—

మూడేళ్ళనుంచీ ఆలోచిస్తూనేవుంది తను. మరీ, మురళితో పరిచయం అధికమ్మై, తన మనస్సు అతని వైపు మొగ్గటం ప్రారంభించిన నాటి నుంచీ తీవ్రంగా ఆలోచిస్తూ వుంది. కాని, తన గొంతుకలో కొట్టుకులాడే ఆ కఠిన సత్యాన్ని ఎంతగా ప్రయత్నించినా మురళి ముందుంచలేక పోతుంది.

నిజానికి, మావయ్య చెప్పినట్టు ఒక యింటిది కావాలనే కోరిక తనకూ వుంది. అందువల్లనే తన మనస్సును మురళికి అంకితం చేసింది. అతనితత్త్వం పూర్తిగా అర్థంకాక ఏవేవో సందేహాలు కలుగు తున్నాయే గాని, మురళిని తన భాగస్వామిగా ఎంచుకోవట మనేది ఎప్పుడో జరిగి పోయింది.

రమణి కుదుపుతో ఆలోచన త్రెంచి ఆమె వైపు చూసింది జ్యోతిర్మయి. రమణి అక్క కళ్ళల్లో కళ్ళుంచి, "నీ సందేహమంతా ఆయన మాటల్లో వ్యత్యాసాన్ని గురించేగా?" అంది.

జ్యోతిర్మయి ఈ ప్రశ్నకు విచలితయ్యింది. 'తన మనోభావాల్ని ఎంత చక్కగా పసికడ్తోంది రమణి!' అని పించింది. అంతలోనే చిరుకోప మొచ్చింది. "నీకెందు కివన్నీ, నువు నిద్రపో" అంది.

రమణి సన్నగా నవ్వుతూ, "నువ్వు చెప్పక పోయినా, నీ డైరీ నాకన్ని విషయాలూ చెప్తూనే వుందక్కా" అని పక్క మీద వాలింది.

"హాఁ...దొంగా.... ఇదా నీ పని?" అని చెల్లెలి మీదకు చెయి విసరింది జ్యోతిర్మయి. రమణి అవతలికి జరిగింది. పిచ్చి ఆలోచనలు పెట్టుకోక, సరే అను. మనిషన్న తర్వాత బలహీనతలు ఎవరి కుండవు?"

జ్యోతిర్మయిలో మళ్ళీ సంచలనం మొదలైంది. రమణి మాటల్లోని సత్యాన్ని గ్రహించిందామె మనస్సు. మురళి రూపం ఆమె కళ్ళ ముందు మెదిలింది. అతని నొక్కుల జుట్టు, ముఖానికంతా అందం తెచ్చే సన్నని మీసం, మనిషికున్న గాంభీర్యాన్నంతా సూచించే ముఖం గోచరించేయి. క్షణంలోనే ఆమెకు కలిగిన భావాలకు సిగ్గేసింది. ఏదో నిశ్చయాని కొచ్చినట్టు దీర్ఘంగా వూపిరి పీల్చుకుని, చెల్లెల్ని కౌగిలించుకుంది జ్యోతిర్మయి!

* * *

మురళి కుర్చీలోంచి లేచి ఉద్వేగంతో ఒక్కడుగు ముందుకు వేశాడు. జ్యోతిర్మయిని రెండు చేతుల్లోనూ పొదివి పట్టుకుని ఆమె కళ్ళల్లో కళ్ళుంచి తమకంతో చూసేడు. ఆనందంతో పూడుకు పోయిన కంఠం పెగల్చుకుని, "నిజం, జ్యోతీ?" అని అడిగేడు.

జ్యోతిర్మయి పైట కొంగును మునిపంట కొరుకుతూ, "వూఁ" అని విలాసంగా ప్రక్కకు తిరిగింది.

అలవోకగా ఆమెను దగ్గరగా లాక్కుంటూ అన్నాడు మురళి, "నువ్వింత శుభ వార్త చెప్తావని నమ్మలేకపోయాను జ్యోతీ. ఎంతగా మనసుకు నచ్చచెప్పుకున్నా, అంతరాంతరంలో ఏదో సందేహం పీడిస్తూనే వుంది."

సన్నగా నవ్వి అంది జ్యోతిర్మయి.

"నమ్మకానికీ, అబ్బాయిలకూ మధ్య కొన్ని వేల కిలో మీటర్ల దూరం."

"ఏమైతేనేం. నేను అదృష్టవంతు

ణ్నాని మరో సారి బుజువైంది." అని హుషారుగా కుర్చీ లోంచి లేచి, "ఈక్షణంనుంచీ రాణిగారు మేం చెప్పినట్లు వినాలి. ఈ రోజుల్లా 'లైట్' ప్రోగ్రావ్, వేసేస్తాం" అని బయటికి నడవబోయేడు మురళి.

"అప్పుడే అధికారం చలాయిస్తున్నారు గానీ, కొంచెం ఆగండి. కాఫీ పుచ్చుకుని వెళ్దురు గాని."

"నో కాఫీ....నథింగ్ ..... చిటికెలో వచ్చేస్తాను, నువ్వు 'రెడీ' గా వుండు. ముందు సరాసరి మా యింటికి వెళ్లి అమ్మా నాన్నకీ శుభ వార్త చెప్పాలి. ఈ లోగా ఒక్కసారి ఆఫీసుకు వెళ్లొస్తాను, కొంచెం అర్జంటు పనుంది."

"ఇప్పుడెలాగండీ, రాజు, రమణీ కూడా ఇంట్లో లేరు......" అని ఇంకా ఏదో చెప్పబోయింది గాని, మురళి అప్పటికే కార్లో కూర్చుని స్టార్ట్ చేశాడు.

— జ్యోతిర్మయి ముస్తాబయి హాల్లో కొచ్చేసరికి వచ్చేశాడు మురళి. వస్తూనే పట్టరాని సంతోషంతో ఆమెను తన బాహువుల్లో బంధించి ఉక్కిరి బిక్కిరి చేస్తూ చెప్పేడు, "నీ నిశ్చయం నాకెంత ఆనందాన్నిచ్చిందో అంతకంత ఆనంద కరమైన వార్త అందింది జ్యోతీ."

జ్యోతిర్మయికి అర్థం కాలేదు. అతని సంతోషాన్ని చూస్తుంటే ఆశ్చర్యమూ కలిగింది. "ఏమిటా, శుభ వార్త?" అంది ఉత్సుకతతో, అతని చేతుల్ని విడిపించు కుంటూ.

"వో....శుభ వార్తే, జ్యోతీ....గొప్ప శుభవార్త! నా జీవితంలోనే ఈ రోజు కొక ప్రత్యేకత ఏర్పడింది. నిజంగా నే నదృష్టవంతుణ్ణి" అని పరవశంతో వూగిపోతూ, కోటు జేబులో నుంచి కవరు తీసి ఆమెకిచ్చేడు మురళి.

కాగితంలోని విషయం చదవటం పూర్తి చేసిన జ్యోతిర్మయి, "బాగుంది... మంచివార్త" అని ముభావంగా, అని నిరుత్సాహంగా కుర్చీలో కూర్చుండి పోయింది.

కవరందుకుంటూ ఆశ్చర్యంగా అడిగేడు మురళి, "అదేం జ్యోతీ, అలా అయిపోయావ్? నాకింత చక్కటి అవకాశం రావటం సంతోషం కదూ?" అంతలోనే ఏదో స్ఫురించిన వాడిలా, తేలిగ్గా నవ్వేసి అన్నాడు; హో హో... అదా నీ బెంగ! నేన్నీకు దూరమవుతున్నాననేగా? సంవత్సరమంటే ఎన్నాళ్లు — గిర్రున తిరిగి రాదూ? ఏడాదయ్యే సరికి తిరిగొచ్చి నీ ముందు వాలి, నీకు పారిస్ వింతలు చెప్పనూ?"

జ్యోతిర్మయి మ్లానంగా నవ్వింది. "అహహ. అదేం లేదు." అని విషయం మారుస్తూ, "వెళ్దామా మరి" అంది.

"వో...కే...." అంటూ ఉత్సాహంగా ఈలవేసి బయల్దేరాడు మురళి.

—కారులో కూర్చున్న జ్యోతిర్మయి మనసులో మురళి తల్లి దండ్రుల్ని గురించీ, అతని విదేశ పర్యటన గురించీ ఎన్నెన్నో ఆలోచనలు రేగినై. పెళ్లిని గురించి తానొక నిశ్చయాని కొచ్చి, తీరా అది ఫలించబోయే తరుణంలో ఈ ఆటంకం! పదిహేను రోజుల్లో ఫ్రాన్స్‌కు బయల్దేరి వెళ్లిపోతాడు మురళి. సంవత్సరమంతా అతని కోసం నిరీక్షణ!

"రా. జ్యోతి" అన్న మురళి పిలుపుతో ఉలిక్కి పడింది జ్యోతిర్మయి. కారు తలుపు తీసి చిరునవ్వుతో ఆహ్వానిస్తున్నాడు మురళి. జ్యోతిర్మయి కారు దిగి అతని వెనగ్గా నడవసాగింది.

కళాత్మకంగా నిర్మింపబడిన ఆ భవనంలో తీర్చిదిద్దినట్లమర్చ బడిన వస్తు సముదాయం, మురళి రాకతో వినయ విధేయతల్ని ప్రదర్శిస్తూ చేతులు కట్టుకు నిలబడి పోయిన నౌఖర్లు— అంతా చూసి దిగ్భ్రమ చెందింది జ్యోతిర్మయి. మురళి వంటి కోటీశ్వరుడు తనకు భర్త కాబోవటం కేవలం తన పురాకృత సుకృత మనిపించిందామెకు తివాచీలు పరచిన హాలు మధ్యగా లోపలికి వెళ్తుంటే, అడుగులు తడబ

ఏనాడోపాపంచేశాను-ఆడపిల్లలతండ్రైనాను-అంటున్నా-ఫ్రెండుతో-పక్కగాడుమన్స్‌కాలేజి అమ్మాయిపోతూందనినాకేంతెల్సా!



గుండెల్లో ఏదో తెలియని బెరుకుదనం విచ్చుకుంది.

రెండు మూడు హాల్స్ దాటి విశాలమైన గదిలో ప్రవేశించారు ఇద్దరూ. గది మధ్యలో నాలుగు వైపులా నాలుగు సోఫాలున్నాయి. ఒక సోఫాలో వయసు మళ్ళిన వ్యక్తి ఒకాయన కూర్చుని ఏదో చదువు తున్నాడు. ఆయనకు దగ్గరగా తివాచీ మీద కూర్చుని ఆయన చదివేది ఆలకిస్తోంది — ఓ పండంటి ముత్తైదువ. మురళి తల్లి దండ్రులు వాళ్ళే కాబోలనుకుంది జ్యోతిర్మయి.

సందేహంగా ఒక ప్రక్కకు నిలబడింది జ్యోతిర్మయి. మురళి వాళ్ళిద్దరి దగ్గరగా వెళ్ళి "అమ్మా, ఈమే జ్యోతిర్మయి" అన్నాడు, తల్లి నుద్దేశించి.

వాళ్ళిద్దరూ తలెత్తి కొడుకునూ, అప్పైన జ్యోతిర్మయినీ చూసేరు. మురళి తల్లి లేచి జ్యోతిర్మయికి దగ్గరగా వచ్చి ఆమెను తేరిపార చూసింది. క్షణాల తర్వాత, "కూర్చో అమ్మా. అలాగే నిలబడిపోయావేం?" అంది, సోఫా చూపుతూ.

జ్యోతిర్మయి వినయంగా సిగ్గుపడింది. ఇంతలో ముసలాయనన్నాడు, "ఆహా... ఏం తెలివే! నువ్వు నిల్చొని కబుర్లు చెప్తూ ఆ పిల్లను కూర్చోమంటే ఎలా కూర్చుంటుందే? అందులోనూ కాబోయే అత్తగారివి"

అంతా సన్నగా నవ్వు కున్నారు. "వాళ్ళిద్దరూ, మీ మాటలూ, మీరూను అంటూ తివాచీ మీదే చతికిలబడింది ఆవిడ. ఆవిడ కూర్చోగానే జ్యోతిర్మయికి కనుసైగ చేశాడు, మురళి. ఆవిడ ప్రక్కగా కూర్చుంది జ్యోతిర్మయి. మురళి సోఫాలో కూర్చున్నాడు.

విషయాన్ని ముసలాయన ప్రారంభించగా, తన కవసరమనుకున్న వివరాలన్నిటినీ సేకరించుకుంది మురళి తల్లి. కొద్ది సేపు తదేకంగా జ్యోతిర్మయి వైపు నఖశిఖ పర్యంతం చూసి, కట్టూబొట్టూ విషయాల్లో ఆమె ఆచరణలో పెట్టాల్సిన మార్పుల్ని సూచించి అన్నది, "అమ్మాయ్ పెద్దగా అందగత్తె కాకున్నా మొహంలో కళుంది. కను ముక్కు తీరు బాగుంది. నాకేం అభ్యంతరం లేదు. వాడేటూ మన శచిని చేసుకోనని భీష్మించుకూర్చున్నాడు గనుక వాడిష్ట ప్రకారమే కానీయండి."

మురళి ఎగిరి గంతేసి, ఆవిడ కాళ్ళకు

# అద్దం తిరిగిన కథ

దణ్ణం పెట్టి తన విదేశ పర్యటనకు సంబంధించిన వివరాలు చెప్పేడు. అవన్నీ విన్న ముసలాయన, "అదేవిట్రా అంత శుభ వార్త ఇందాకట్నుంచీ చెప్పవేం" అని కొడుకుని మందలించేడు. ఆ దంపతుల ముఖాల్లో వెల్లి విరిసిన ఆనందాన్ని చూసి తనలో తను నవ్వుకుంది జ్యోతిర్మయి.

అక్కణ్ణుంచీ సంభాషణ మురళి ఫ్రాన్స్ పర్యటన మీదికి మళ్ళింది. ముసలాయన తా నసలెలా వ్యాపారాన్ని ప్రారంభించిందీ, అదెలా వృద్ధిచెందిందీ మొదలైన వివరాలు చెప్తూ, నలభై కంపెనీల మేనేజింగ్ డైరెక్టర్స్ 'అప్లై' చేసుకుంటే ఆ అవకాశం తన కొడుక్కు రావటం ఎంత గొప్ప విషయమో ఏకరువు పెట్టాడు.

ఆ తర్వాత మురళి ప్రయాణ సన్నాహాల్ని గురించి తల్లి దండ్రు లిద్దరూ మాట్లాడసాగేరు. పైగా అతనికి అప్పుడే 'జాగ్రత్త'ల్ని మూట కట్టటం మొదలెట్టేరు. సంభాషణని మధ్యలోనే త్రుంచేసి లేచాడు మురళి. సెలవు తీసుకోబోతూ వాళ్ళిద్దరికీ నమస్కరించింది జ్యోతిర్మయి.

పార్వతీ పరమేశ్వరుల్లా వున్న ఆ దంపతుల స్వచ్ఛమైన కళ్ళల్లోకి చూస్తుంటే, నమస్కరిద్దామని ఎత్తిన జ్యోతిర్మయి చేతులు వణికినై. నేరస్థురాలిలా ఆమె చూపులు నేలకు మరలినై. ఉవ్వెత్తున పొంగిన భావ సంఘర్షణని తనలోనే అణచుకుని గిరున వెనక్కు తిరిగింది. మూర్తీభవించిన మంచితనంగా వున్న ఆ వృద్ధ దంపతుల్ని మభ్య పెడుతున్నానేమోనన్న అనుమానం కలిగి మనసంతా కలచినట్లైంది జ్యోతిర్మయికి.

ఇంటికి వచ్చిన జ్యోతిర్మయి మురళి ఎంతగా బ్రతిమిలాడినా అతనితో ఆపూట సరదాగా గడపలేకపోయింది. అనుకున్న కార్యక్రమాలన్నిటినీ రద్దు చేసుకోక తప్పలేదు మురళికి.

మర్నాడు

తెల్లవారుతూనే వచ్చాడు మురళి. మురళి వచ్చేసరికి జ్యోతిర్మయి తలంటి పోసుకుని కురులార్చుకుంటున్నది. ఆ రోజు తను, మరి కొంతమంది మిత్రులూ కలిసి పిక్‌నిక్‌కి వెళ్ళబోతున్నట్లు చెప్పాడు మురళి. జ్యోతిర్మయి రాకుంటే ఆ కార్యక్రమానికి శోభ లేనట్లు కూడా వర్ణించి, ఆమెను ఆహ్వానించాడు. జ్యోతిర్మయి 'సరే' నంది. మురళి ఆనందానికి హద్దే లేకుండాపోయింది.

మురళితో ఏకాంతంగా వుండటం తటస్థించి నప్పుడల్లా తన గుండెల్లో దాచుకున్న గరళాన్ని అతని ముందు కక్కేయాలని విశ్వప్రయత్నం చేసింది జ్యోతిర్మయి. అయితే, ఆ ప్రయత్నంలో ఆమె అసహాయ అయింది. ధైర్యాన్ని పుంజుకుని తీరా చెప్పేద్దామని నోరు మెదిపితే పెదవులు వణికి, శరీరం నీరుకారి మాట గొంతుదాటి వచ్చేదికాదు. మానసికమైన ఆందోళన, ఆవేదన దైహికమైన నిస్సహాయతగా పరిణమించేయి. ఇక, మురళికా రహస్యం ముఖాముఖగా చెప్పలేననే నిశ్చయాని కొచ్చింది జ్యోతిర్మయి.

జ్యోతిర్మయి అనుభవిస్తున్న ఈ సంఘర్షణని మురళి గమనించలేదు. ఆమె అలిసినట్లు కనిపించి ఒకటి రెండుసార్లు ప్రశ్నించాడే గాని, అది అలసటకాదనీ, ఆమె, హృదంతరాళాల్లో మండుతున్న వేదన అనీ గుర్తించలేకపోయాడు.

పదిహేనురోజులూ పదిహేను నిముషాల్లా గడిచాయి మురళికి. జ్యోతిర్మయికి కాలం అంత వేగంగా పరుగెత్తుతున్న ఛాయ లేమీ కనిపించలేదు.

ఈ పదిహేను రోజుల్లోనూ మురళి ఆనందం కోసం అతనితో కలిసి తిరిగింది జ్యోతిర్మయి. మురళి తను విదేశాల్లో చేయబోయే ఘనకార్యాల్ని గురించి, అక్కడ నుంచితేబోయే విచిత్ర వస్తువుల్ని గురించీ ఏవేవో మాట్లాడేడు. జ్యోతిర్మయిపై తన కున్న ప్రేమను అనేక విధాలుగా ఆమెకు బహిర్గతం చేసి తా నామెను మరువనని బాసలు చేసి, ఆమె నుంచీ అలాగే ఎన్నెన్నో బాసలు తీసుకున్నాడు. ఈ పదిహేనురోజుల్లో కూడా మురళి, సమస్యల్ని గురించి, వాటి పరిష్కారాల్ని గురించి, వ్యక్తిగత సంస్కారాన్ని గురించి ఉపన్యాసామిచ్చాడు. వీలైనప్పుడల్లా.

జ్యోతిర్మయికి కొంచెం ధైర్యం చిక్కింది. సమాజాభ్యుదయాన్ని కాంక్షిస్తూ, నాగరికంగా జీవిస్తూ, వినూత్నమైన భావాలతో అభిప్రాయాలతో విదేశాలకు వెళ్తున్న మురళి సంస్కారం తన బాధను అవగతం చేసుకోగలదనే ఆశ అంకురించింది. అతనికా విషయాన్ని నిర్భయంగా తెలియజేయవచ్చు

సనే నమ్మకమూ కలిగింది.

మురళి వెళ్ళేరోజు వచ్చింది.

అతని తల్లిదండ్రులతోపాటు కారులో తనూ విమానాశ్రయానికి వెళ్ళింది జ్యోతిర్మయి. ప్రాణాధికంగా ప్రేమించే అతని తల్లి మురళి 'ప్లేన్' దగ్గరికి నడుస్తుండగా ఉండపట్టలేక గొల్లున ఏడ్చింది. భర్త ధైర్య వచనాలు చెప్పి ఆమెను ఓదారుస్తున్న దృశ్యం చూసేసరికి జ్యోతిర్మయికే కళ్ళ నీళ్ళు తిరిగినై.

నీళ్ళు నిండిన కళ్ళతోనే వీడ్కోలిచ్చేరు ముగ్గురూ.

* *

మురళి వెళ్ళిన రెండు నెలల్లోను జ్యోతిర్మయి అతని నుంచీ ఐదు వుత్తరాల్ని అందుకుంది. ఈ ఐదు జాబుల్లోను అతను ఎన్నెన్నో వింతల్ని గురించి రాసేడు. ప్రతి వుత్తరంలోనూ చివర స్వయంగా ఆమెకు వర్తించేటట్లు తమ ప్రేమను గురించి ఏదో ఒక ఛలోక్తి విసిరేవాడు. జ్యోతిర్మయికి దాన్ని మళ్ళీ మళ్ళీ చదువుకుని ఆనందించటం ఒక గొప్ప అనుభూతిగా మారింది.

కలిసిన మనసులు ఈ ఎడబాటుతో మరింత దగ్గరైై, ఇద్దరి హృదయాల్లోను తీయని భావాలు, బాధ మొలకెత్తినై.. ఊహాల డోలల్లో ఉగుతూ పరవశమవుతున్న మనస్సుతో, ఆవేళ మురళికి జాబు వ్రాయాలని కూర్చుంది జ్యోతిర్మయి

తన విశేషాలు, మురళి తల్లిదండ్రుల విషయాలు అన్నీ వ్రాసి జాబు పూర్తి చేయబోయే సమయంలో వప్పున స్ఫురించింది. 'ఆ' విషయం కూడా రాస్తే బాగుంటుందని...అర్ధగంట సేపు ఆలోచించి వ్రాయటం ప్రారంభించింది.

'...ఈ రహస్యాన్ని మీకు నివేదించాలని మీతో పరిచయమైన నాటినుంచీ ఎంతగానో ప్రయత్నిస్తూనే వున్నాను. కాని, ఏదో అజ్ఞాత శక్తి ఎప్పటికప్పుడు నా గొంతు నొక్కేసింది. ముఖాముఖి వ్యక్తం చేయలేని ఈ బాధని ఈసారి వ్రాస్తున్నాను. విశాల దృక్పథంతో ఈ సమస్యని ఆలోచించి నన్ను క్షమిస్తారనే నమ్మకమే నాచేత ఇలా వ్రాయిస్తున్నది.

..ఇక, అసలు విషయం. విధి వైచిత్రాల్ని చూడటం, అనుభవించటం మనుష్యులకు క్రొత్తగాదు. నాకు సంభవించిన దుర్దశ కూడా అలాంటిదే. నాకు పదవయేటనే ముచ్చటపడి నన్ను మా మావయ్య కొడుక్కిచ్చి వివాహం చేశారు, మావాళ్ళు! అభంశుభం తెలియని పసిదాన్ని నేను. నా పన్నెండవయేట అతను మశూచికి గురయి 'మరణించాడు!....

. ఆ తర్వాత వివరాలు అవసరం లేదనుకుంటాను. మావయ్య కూడా మీ వంటి సంస్కరణాభిలాషి కావటం నా అదృష్టం. ఆయన ప్రోద్బలంతోనే చదువుకున్నాను. 'మళ్ళీ పెళ్ళి' అనే ఆలోచనని నాకు కలిగించిన ఘనత కూడా ఆయనదే...'

..'దీనితో ఇంత ఆవేదన పొందాల్సిందేముంది?' అనే చల్లని మీ మాట కోసం వేయికళ్ళతో ఎదురుచూస్తూ వుంటాను. సెలవ్.' మీ, జ్యోతిర్మయి.

రాసిన వుత్తరాన్ని మరోమారు చదువుకునే సరికి, గుండెల మీదనుంచీ కొండంత బరువు తీసినట్లయి స్వేచ్ఛగా వూపిరి పీల్చుకుంది జ్యోతిర్మయి.

* * *

రోజులు కాలగర్భంలో దాక్కుంటున్నాయి.

జ్యోతిర్మయికి విశాఖపట్టణం బదిలీ అయింది. మురళి నుంచీ తానాశించిన జాబు రాలేదు. దానికోసం ఎదురు చూసి చూసి, చివరికి అతని మంచితనాన్ని శంకించింది జ్యోతిర్మయి మనస్సు. మురళి వంటి వ్యక్తి తన గత చరిత్రను క్షమించలేకపోయాడంటే ఆశ్చర్యం, విషాదం రెండూ కలిగేయి

హైదరాబాద్ వదిలి వస్తూ మురళి తల్లిదండ్రుల వద్ద సెలవు తీసుకోటానికి వెళ్ళింది జ్యోతిర్మయి. ముసలాయన మురళి పద్ధతి, ప్రవర్తనా తనకేమీ బాగాలేవని విసుక్కున్నాడు కనీసం వాళ్ళకు వ్రాసే జాబుల్లోనైనా జ్యోతిని గురించి రాయకపోవటం తమకు అర్థం కావటంలేదన్నాడు. మురళి తల్లి మాత్రం "ఆ. కుర్రకుంక, వాడు ప్రత్యేకం ఏంరాస్తాడు? ఇదివరకు నిశ్చయించుకున్నదే గదా, నువ్వు ఇక్కడే వుండిపో జ్యోతీ, ఉద్యోగం వద్దూ ఊరూ వద్దు!" అంది.

ఆ సలహాకి సుతరామూ ఒప్పుకోలేదు జ్యోతిర్మయి. చివరికి ముసలాయన అన్నాడు "ఇంకో రెండునెలల్లో వాడు రావాలి గదా. రాగానే మేమే వచ్చి తీసుకొచ్చుకొంటాం" అని.

'అంతటిఅదృష్టానికి నేనోచుకున్నానా?' అనుకుని వచ్చేసింది జ్యోతిర్మయి.

* * *

మూడేళ్ళు గడిచినై జ్యోతిర్మయి ప్రస్తుతం చిత్తూరులో ఉద్యోగం చేస్తున్నది. మురళిని గురించి ఆమెకె వివరాలూ అందలేదు, ఈ మూడేళ్ళల్లోను.

ఆవేళ, ఆఫీసులో తను పని చేసుకుంటుండగా ప్యూన్ కవరొకటితెచ్చిచ్చాడు జ్యోతిర్మయికి. ఆమె ఆ కవరందుకుంది. అది ఆమె హైదరాబాద్ అడ్రస్‌కు రాసింది, 'పార్ ఏవియన్' కవరు! హైదరాబాద్ నుంచి అది వైజాగ్ వెళ్ళి అక్కణ్ణుంచీ చిత్తూరుకు 'రీ డైరెక్ట్' అయింది. కవరు మీది అడ్రస్‌ను పరీక్షగా చూసింది జ్యోతిర్మయి. పరిచయమైన రాతకాదు! ఆతృతతో, ఉత్సుకతతో చించి చూసింది.

'నే నెవ్వరో నీకు బొత్తిగా తెలియదు కాని, నిన్ను గురించి నాకు పరోక్షంగా పూర్తిగా తెలుసు. స్వచ్ఛమైన నీ మనసు, అందమైన నీ ముఖం నాకు పరిచయమైనవి. జీవితంలో నాకు అందని ఆనందాన్ని, మాధుర్యాన్ని పంచిపెట్టిన భాగ్యశాలిగా నీయెడల నాకు అమితమైన కృతజ్ఞత, వాత్సల్యం వున్నై. నీ పరిస్థితులకు, దుస్థితికి జాలిపడటం తప్ప నేనేమీ చేయలేను. అయినా, ఆదరపూర్వకంగా, కృతజ్ఞతా సూచకంగా నేనిందుతో పంపుతున్న 'డ్రాఫ్ట్'ను అంగీకరించు. మన మిద్దరం మంచి మిత్రులుగా వుండిపోదాం. మోహన్ మా దేశంలో స్థిరపడి నన్ను పెళ్ళాడాడు. ..మిత్రురాలు, మార్గరెట్'—

మురళి పేరు మురళీమోహన విశ్వేశ్వరరావని చప్పున స్ఫురించింది జ్యోతిర్మయికి! ఆమె దిగ్భ్రమ చెందింది!! ●





# "బిజినెస్ భాష"

Jayadev
























హాకీ ఆటవాడే రాజుకు వెన్నునొప్పి













ఒకే ఒక **సారిడన్**

'రోష్'

## నొప్పిని పోగొట్టును, సేదదేర్చును, నవోత్సాహమును కలిగించును.

నొప్పికి ఉపశమనకారిగా ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన సారిడన్ నొప్పులనుండి త్వరితముగా, నిరపాయముగా, నిశ్చయముగా ఉపశమనం కలిగిస్తుంది. తలనొప్పి, పంటినొప్పి, ఒళ్ళునొప్పులు, మామూలు అస్వస్థతలు మొదలైనవాటి నివారణకు ఎల్లప్పుడూ సారిడన్ వాడండి. ఒక బిళ్ళ పూర్తి మోతాదు. పిల్లలకు ¼ నుంచి ½ బిళ్ళ వెయ్యవచ్చును.




ఒకే ఒక సారిడన్ బిళ్ళ చాలును

'రోష్' తయారు
ఏకైక డిస్ట్రిబ్యూటర్లు
వాల్లాస్ లిమిటెడ్



సీరియల్:




## జరిగిన కథ

ఆమ్రపాలి అందచందాలను గురించి విన్న మగధరాజు బింబిసారుడు ఆమె నెలాగైనా తన దాన్ని చేసుకోవాలనే ఉద్దేశ్యంతో వైశాలీనగరంలో పుత్తళికల సూత్రధారుడుగా ప్రవేశిస్తాడు. రేవా ఆదేశానుసారం పాలి భవనంలో ప్రవేశించి ఆమెదృష్టిని ఆకర్షిస్తాడు. బింబిసారుడు నేర్పుతో అవందుడిపి, పాలిని ఆపదనుంచి తప్పిస్తాడు. పాలి, బింబిసారులు ఉద్యానవనంలో కలుసుకుంటారు. పాలి, బింబిసారుల హస్తాల్ని పరీక్షించి కోర్కెలు నెరవేరుతాయని చెప్తాడు. తననిగురించి అడిగిన పాలికి అప్పటికప్పుడు తానేమీ చెప్పలేనని సమాధాన మిస్తాడు బింబిసారుడు. అదివిన్న పాలి బింబిసారునిపై తన అవిశ్వాసాన్ని ప్రదర్శించి కోపంగా వెళ్లిపోతుంది. పాలి భవిష్యం నిశ్చితం అయే ఆరోజు సంధాగారంలో సభాసదులంతా మహానాముని రాక కోసం ఎదురుచూస్తుంటారు. ప్రవేణి పుస్తకంలో పేర్కొన్న విధంగా పాలి భవిష్యాన్ని నిర్ణయం చేస్తాడు మహానాముడు.

# 14

తీవ్రన మృత్యువు సమీపించడం చూచి మహానాముడు పాలిని వేగంగా తీసుకురమ్మన్నాడు. కాని ఈ కారణం అత డానందుని కెరుక పరచలేదు. పాలీ, ఆ నటరాజూ భావుకలో పడి ఏమైనా అనుచిత కార్యం చేస్తారేమో అని ఆనందుని భయం. అందుకే అతడూ వేగంగా వెళ్లగోరాడు. కాని అతడీ కారణాన్ని తండ్రి కెరిగించలేదు.

ఆనందుడు నందీగ్రామం వెళ్లడానికి తండ్రి శయ్య నుండి లేచి నిల్చున్నాడు. అప్పుడే మార్గంలో దూరం నుండి ఉన్మత్తుడైన సుధీరుని అరపు వినిపింపసాగింది. “మూర్ఖుడా, ధూర్తుడా, కాపురుషుడా”.

విచ్చియున్న కళ్లను మహానాముడు మళ్లీ మూసుకున్నాడు. అతని వక్షంపై ఎవ్వడో బల్లెంతో గాయపరుస్తున్నట్లుంది. క్రమంగా సుధీరుని కేక సమీపానికి రాసాగింది. అది స్పష్టంగా వినిపించి కొంచెం సేపటితో దూరంగా పోయింది. అతని కేకతో పాటు ప్రజల విమర్శనమూ వినిపిస్తోంది. చాల కష్టంతో ఆనందు డిదంతా పండ్లు కొరుకుతూ వింటున్నాడు.

*   *   *

వేదాంతి పాదాల మీద వంగి పాలీ బింబిసారులు ఆశీర్వాద మడుగుచున్నపుడు బింబిసారుని దృష్టి ఆశీర్వచనంపై లేక మరో వైపుంది. పాలి తన్ను వివాహమాడటాని కెట్లు స్వీకరించిందని అతడు దిగ్భ్రమఘనిలా ఆలోచిస్తున్నాడు. అతడు మళ్లీ శీఘ్రాతి శీఘ్రంగా గడచిన ఘటనల్ని స్మరింపసాగాడు.

వృద్ధుడైన అభిరాముడు ప్రాతఃకాలానికి పూర్వమేవచ్చి అకస్మాత్తుగా అతణ్ణి మేల్కొల్పాడు. సూర్యోదయానికి ముందే గ్రామానికి వెలపల వేదాంతి సమక్షంలో వివాహ విధిపూర్తయింది. సూర్యోదయం కాగానే పాలీ బింబిసారులు పతిపత్నీ రూపంలో వేదాంతి పాదాలపై వాలి ఆశీర్వాదమడుగుతున్నారు. బింబిసారుడు ముగ్ధుడు అవునట్లు ఈ ఘటనలన్నీ ఒకదాని వెనక ఒకటి అతిశీఘ్రంగా జరిగిపోయాయి. వేదాంతి వాళ్ల నాశీర్వదించాడు. అప్పుడు వాళ్లిద్దరూ దగ్గర నిలబడ్డ అభిరాముని పాదాలపై బడ్డారు.

అభిరాముని కళ్లు అశ్రుపూరితాలయ్యాయి. ఒక్కసారి అతడు దీర్ఘంగా శ్వాసించి ఇద్దరూ కౌగలించుకున్నారు.

నిజానికి అభిరాముడే ఇంత శీఘ్రంగా ఇంత ఘనకార్యం చేశాడు. బింబిసారుణ్ణి గురించి ఎవరికీ చెప్పక, రెండుదేశాల మేలు కోసం పాలీ బింబిసారుల వివాహం జరగాలని వేదాంతితో నిశ్చయించి అభిరాము డిద్దరినీ వేదాంతి సమక్షంలో వివాహితులుగా చేశాడు. పాలి వివాహమయినట్లు ఈ నలుగురు వ్యక్తులూ తప్ప ఎవ్వరూ ఎరగరు.

రాత్రి అయింది. అది చంద్రుడూ నక్షత్రాలూ గల రాత్రి. నేడు పాలికి మఖ సమయం, ఆనందునికి హద్దు. వివాహం నాటి మొదటి స్వర్ణరాత్రికై ఇంద్రుడు సైతం మానవుడు కాగోరుతూంటే, మనుష్యుని సంగతి చెప్పడాని కేముంది? శయన మందిర శోభ మారింది. రాత్రి కోసం అద్భుతమూ, అననుభూతమూ అయిన శృంగారం తయారయింది. బింబిసారుడు శయనాగారంలో అడుగుపెట్టాడు. పాలి అతని పాదాలను గట్టిగా పట్టుకుంది. అప్పుడే ప్రపంచం ఏదో నూతన రూపాన్ని రచించింది. పాలిని లేవనెత్తి బింబిసారుడామెను తన వైపునకు లాక్కున్నాడు. ఆమె కంపించింది. బింబిసారు డామెను బాహుపాశంలో బంధించాడు. పెదవులు పెదవులను అంటాయి. హృదయం హృదయాన్ని అంటింది. అప్పుడు బింబిసారుడు పాలిని భుజములలోకి ఎత్తుకున్నాడు. ఆ నాడు గంగ సమీపంలో ఉన్న గుట్ట పైకి ఎక్కేటప్పుడు అలాగా ఎత్తుకున్నాడు. తన ప్రపంచం మత్తులో పరివ్యాప్తమయినట్లూ, దానిని చూడకుండానే అనుభవింప గోరుతున్నదో అన్నట్లూ ఆమె కళ్లు మూసుకుంది. కొన్నిక్షణాలు ఆమె వైపు రెప్ప వాల్చకుండా చూచి బింబిసారుడు శయ్య వైపు వెళ్లాడు.

పాలి కళ్లు విప్పగానే తన ప్రపంచం మారినట్లు ఆమె చూచింది. ముఖం తిప్పి ఆమె తన వెనక వైపున బింబిసారుడు నిద్రామగ్నుడై ఉండడం చూచింది. చూడసాగింది.—ఎంత అందమైన ముఖం, ఎంత ఉజ్జ్వలమైంది! క్రమంగా ఆమె స్వామి వక్షస్థలంలో తన శిరం దాచి కళ్లు మూసుకొని మాటాడక పడుక్కుంది. బింబిసారుడు ప్రాతఃకాలమందలి మధుర నిద్రలో నిమగ్నుడయ్యాడు. అతని చెయ్యి ఒకటి పాలి కంఠాన్ని చుట్టుకుంది. పాలి చేష్టలుడిగి పడుక్కుని ఆలోచిస్తోంది.

వృద్ధుడు అభిరాముడు ముహూర్తం తప్పిపోతుందనే వంకతో వివాహమాడడానికి ఇంతగా ఎందుకు అపేక్షించాడు? ఆమె కూడా అతడు సత్యవంతుడని ఎందు కంగీకరించింది? పరిచయంలేని పరదేశిని వివాహమాడడానికి ఇంత శీఘ్రంగా ఎలా సిద్ధమైంది? వివాహం కూడా చేసుకుందే? సోదరునిగాని, తండ్రిని గాని అడగకుండానే? ‘ప్రశ్నించకుండానే త్వరగా వివాహం చేసుకో’ అన్న అభిరాముని మాటలందు ఆమెకు విశ్వాసం ఎలా కలిగింది?...ఆమె కోపమేమైంది? మరి నిశ్చయం?...ఈ ప్రశ్నలికి

జవాబు వెదకడానికి పాలి వ్యర్థంగా ప్రయత్నింప సాగింది. గడ్డం, మీసాలూ లేకుండా నిద్రపోయిన బింబిసారుని సౌందర్యం కూడా రాత్రికి రాత్రే ఎన్నో రెట్లు పెరిగింది. అతణ్ణి చూడగానే పాలి మళ్ళీ కళ్ళు మూసుకుంది.

ప్రాతఃకాలమైంది. రోజూ లాగావే ఇద్దరూ గంగ ఒడ్డున కొండ మీద కూర్చుని మళ్ళీ మాట్లాడుకో సాగారు. 'నీ వెవరో ఇప్పుడు చెప్పు' అని పాలి అంది. బింబిసారుడు అదిరిపడ్డాడు. విస్మితదృష్టితో అతడు పాలి వైపు చూచి, 'తాత నీకు చెప్పలేదా?' అన్నాడు. 'తాత ఎరుగునా?' అని పాలి మరింత ఆశ్చర్యంతో అంది.

'అవును, ఆనందరాజూ ఎరుగును, నేనెవణ్ణో.'

'అయితే నా ఒక్కతికే తెలియదన్న మాట! నా కెందుకు చెప్పలేదు?'

'నీకు చెప్పాలని నేను నిశ్చయించుకున్నప్పుడు తాత, ఆనందుడు నన్ను అడ్డుకున్నారు.'

'వివాహానికి ముందు చెప్పకుండా ఉండడంలో ఏమైనా రహస్యముందా?'

'అవును, అది రెండురాష్ట్రాలకు సమస్య.'

'అంటే?' పాలి మాట్లాడుతూ ఆగిపోయింది. ఆమె దృష్టి కఠోరమయింది. ఆమెకు సందేహమయింది. సందేహం సత్యమయింది. ఆమె అంది 'నీవు మాగధీయుడవా? చెప్పు నీవు మాగధీయుడవా?'

'అవును పాలీ, నేను మాగధీయుణ్ణి. మాగధీయుల ప్రభువైన బింబిసారుణ్ణి.'

'బింబి..వజ్జీయులకూ లిచ్ఛవీయులకూ గర్భవిరోధి?'

'ఇప్పుడు లిచ్ఛవీయులకు పరమమిత్రుణ్ణి బంధువును...'

'చాలు, ఒక్కమాట కూడా అధికంగా మాట్లాడకు' అని పాలి నిలబడింది. మనస్సులోని భీషణ జ్వాల శరీరాన్ని కూడా దహించింది. అమెను ఎవడో స్వర్గంలోని ఉన్నత శిఖరం నుండి నరకంలోని గోతిలోకి పడగొట్టాడన్నట్లుంది.

'పాలీ, నా ఒక్కమాటే విను, చాలు. తరవాత, ఏ శిక్ష విధించినా సంతోషంతో స్వీకరిస్తాను.'

'నేను శత్రువుతో మాట్లాడను' అని పాలి ముఖం తిప్పివేసి మాట్లాడడాని కారంభించింది. 'ద్రోహీ, కపటీ, స్వార్థపరుడా, పారుబోతా' అని అంటూంటే ఆమె కళ్ళు అశ్రువులతో ఉప్పొంగసాగాయి.

బింబిసారుడు ఆమెను సమీపించి అన్నాడు: 'ఒక్కసారి నామాట విను. వైశాలీ రాజగృహాలనూ, లిచ్ఛవీయ మాగధీయులనూ ఒకటిగాచేయడానికి ఒకటేమార్గముంది.— ఒకడు ఇంకొకడికి ప్రేమ విజితుడవడం. నా మహామాత్యుడు లిచ్ఛవీయులకూ మాగధీయులకూ జరిగిన చిన్న సంఘర్షణలో అకస్మాత్తుగా ప్రాణాలర్పించాడు. కాని చనిపోడానికి ముందు అతడు నాకో మంత్రం ఇచ్చి పోయాడు. నేను ఆ మంత్రాన్నే ఆనందుడికి ఎరిగించాను. వృద్ధ అభిరాముడూ, తపస్వి వేదాంతుడూ ఆ మంత్రాన్నే ప్రయోగించారు. పాలీ, నేటి నుండి నీవు లేనిదే నేను నిర్జీవుడను. మన మిద్దరమూ ఒకటి



నీవు రాజగృహానికి పట్టపురాణివై లిచ్ఛ వీయులకు ప్రేమించడం నేర్పగలుగుతావు. వైరం తనంత అదే విస్మరింపబడుతుంది. స్నేహం ప్రకటితమవుతుంది. త్వరలోనే కటువూ, ఘర్షణా శాశ్వతంగా నశిస్తాయి. నాకు నా రాజ్యాన్నీ, నన్నూ రక్షించుకోడానికి ఒక్కటే ఉపాయం కన్పించింది. అది మన వివాహం. నిన్నూ, లిచ్ఛవీయులతో పాటుగ నన్నూ సురక్షితంగా ఉంచుకోడానికి ఒక్కటే మార్గం ఉంది. దీన్ని స్వీకరించడమో మానడమో నీ ఇష్టం.'

పాలి అమాయకురాలిలా వింటోంది—ప్రేమతో పాటు రాష్ట్రోద్ధరణ విషయం విని ఆమె నిస్తబ్ధురాలైంది. కాని రోషం ఇంత శీఘ్రంగా శాంతించలేదు. ఆమె చేయి పట్టుకొని బింబిసారుడు మెల్లగా చెవిలో చెప్పసాగాడు. 'ఈ కోపం మగధ మహారాజ్ఞికే శోభ నిస్తుంది. పారబడిన వారిని క్షమించడమే మహారాణి కర్తవ్యం. మగధ ప్రజలు మహారాణి దర్శనానికై అత్యంత ఆతురులవుతున్నారు కాబట్టి రేపే మీరు ఇక్కడనుండి బయలుదేరాలి అని మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను.'

'నేను మహారాణిని కాను.'

'మగధ ప్రజలు దీనిని ఒప్పుకోరు.'

'నేను మగధ ప్రజలను చూడనైనా లేదు.'

'ప్రజా ప్రతినిధిని చూస్తున్నావు కదా?'

'నన్ను నవ్వించడానికి ప్రయత్నించకు.'

'సరే. ఏడిపించడానికి ప్రయత్నిస్తాను. రేపు ఆనందుడు రావడమే ఆలస్యం.'

'వ్యర్థ ప్రలాపాలు వినడం నా కిష్టం లేదు.'

'నేను చాలా రహస్య విషయాన్ని చెప్తున్నాను. ఈ పాటికి ఆనందరాజు తండ్రి గారితో మన వివాహ విషయం చెప్పే ఉంటాడు. వాళ్ళు రేపు ఇక్కడికి ఆశీర్వదించడానికి వస్తారు. తరవాత మనం ఇక్కడి నుండి వెళ్ళిపోదాం. తండ్రినీ, దేశాన్నీ విడిచి పెట్టేటప్పుడు మగధ మహారాజ్ఞి తప్పకుండా విలపిస్తుంది. నిన్ను ఏడిపించడానికి కొంచెమైనా ప్రయత్నం చేయనవసరం ఉండదు. మహారాణి ఆజ్ఞ ఏమో చెప్పవచ్చు.'

అశ్రుపూరిత నేత్రాలతో పాలి అతని వైపు చూస్తూ ఉంది. కోపంలో ఆమె అందంగా కన్పించింది. విలపించేటప్పుడు అలాగే ఉంది. బింబిసారుడు భావావేశంతో ఆమెను హృదయానికి హత్తుకున్నాడు. బింబిసారుని స్పర్శ పాలి కోపాన్నీ, శక్తినీ శిథిలం చేసింది. ఆమె తన సర్వస్వాన్నీ సమర్పించి అలాగే బింబిసారుని వక్షాన్ని ఆని ఉంది.

'పాలీ, రేపే బయలుదేరదామా?'

'ఆఁ'

'నీవు పట్టపురాణివి అవుతావా?'

'ఏమిటీ, అక్కడ ఇతర రాణులెవరూ లేరా?'

'రాణులు ఉండవచ్చు. మహారాణి ఒక్కతే, ఆమ్రపాలి!'

'నేను మహారాణి నవను.'

'ఏం, రోషమింకా శాంతించలేదా? దేవీ, అపరాధాన్ని క్షమించవా?'

'శత్రువును క్షమించడమా?'

'మాగధీయులు శత్రువులను సహితం క్షమిస్తారు. మాగధీయ మహారాజ్ఞి ఒక మాగధీయుణ్ణి క్షమించదా?'

పాలి కళ్ళు మళ్ళీ చెమ్మగిల్లాయి. బింబిసారుడు స్వయంగా వినమ్రుడై ఆమెను బతిమాలాడు. పాలి అతనికి సమర్పితమైంది. కాని పైకల్లా కోపించి బింబిసారుని బాహువుల్లో బంధింపబడి ఉండి అంది—

'మహారాణి క్షమించదు, శిక్షిస్తుంది.'

'మీ ఆజ్ఞానుసారమే. శిక్షా విధానం ఎలాంటిదో?'

'ఉచిత సమయంలో ఉచిత శిక్ష లభిస్తుంది.' ఇలా అని ఆమె కళ్ళు మూసుకుంది. ఇది ఆహ్వానం.

'మహారాణి ఆజ్ఞానుసారమే' అని బింబిసారుడు పాలిని ముద్దు పెట్టుకున్నాడు.

* * *

సాయంకాలమైంది. మార్గాయాసంతో చాలా అలసి ఆనందుడు నందీగ్రామం చేరాడు. మొట్టమొదట అతడు అభిరాముణ్ణి కలిసికొన్నాడు. కాని అతడు అతనికి గుప్త వివాహాన్ని గురించి చెప్పగానే అతడు నిల్చున్న చోటనే కూర్చున్నాడు. అధికమైన మానసిక వేదన వల్ల అతని తల తిరిగింది.

'తాతా, మన పాలి చనిపోయింది..' అని ఆనందుడు విషయాన్నంతా అభిరామునికి, వినిపించాడు. వృద్ధుడు ఆశ్చర్యంతో మూగ్గుడయ్యాడు.

ప్రాసాదంలో కాలు పెట్టగానే ఆనందుడు పాలీ బింబిసారులను చూశాడు. సోదరిని చూడగానే అపారమైన వేదన అతని హృదయాన్ని బాధించింది. అప్పుడతడు ఆమె చెయ్యి పట్టుకొని తన కక్ష్యలోకి తీసుకుపోయి, ద్వారం మూసి, పెదాలు కొరుకుతూ పాలి వైపు చూడసాగాడు.

పాలి జీవితంలో తొలిసారిగా తన సోదరుడికి భయపడింది. లిచ్ఛవీయ మాగధీయ రాజకీయ సంబంధాల్ని దృష్టిలో ఉంచుకొని పాలిని తక్షణమే రాజగృహానికి తీసుకుపోయి రెండు రాజ్యాలకూ గల వైరాన్ని తొలగించే విషయం బింబిసారుడు ఆనందునికి చెప్పాడు. దాని ఫలితంగా ఆనందుడు రాగానే ఇద్దరినీ నందీ గ్రామం నుండి పంపి వేయడానికి ఏర్పాటు కూడా చేయబడింది. బహుశా తండ్రిగారు రాలేదు. బహుశా సోదరుని అభిప్రాయం మారింది. లేకపోతే ఆమె శాశ్వతంగా అందరినీ వదిలి వెళ్ళిపోతుంది. ఇందుచేత సోదరుని ముఖ ముద్ర ఇంత కఠోరంగా ఉండలేదు కదా?

'సోదరా, వైశాలిలో ఏమి జరిగింది? తండ్రిగారు ఎంచేత రాలేదు? నా వల్ల ఏమైనా అపరాధం జరగలేదు కదా?'

'అవును, క్షమింపరాని గొప్ప తప్పిదం జరిగింది. నీవు స్త్రీవై ఎందుకు పుట్టావు? స్త్రీవై ఇంత అందగత్తెవు ఎందుకయ్యావు?'

'సోదరా' అని పాలి ఆనందుని వైపు పరుగెత్తి అతని నోటిపై హస్తముంచింది. కాని ఆనందుడు ఆ కాఠిన్యంతోనే ఆమె హస్తాన్ని గట్టిగా పట్టుకొని ఆమెను ఈడ్చి బలవంతంగా క్రింద కూర్చోబెట్టి పళ్ళు కొరుకుతూ అన్నాడు. 'అభాగ్యురాలా, నీవు వైశాలిలో ఎందుకుపుట్టావు? నీవు ఒక లిచ్ఛవీయుడికి పుత్రిక ఎందుకయ్యావు?'

క్రోధ కఠోరముల తీవ్రత మూలంగా ఆనందుని కళ్ళ నుండి అశ్రువులు ప్రవహింప సాగాయి. కేకవేసి పాలి అతని మెడకు చుట్టుకొని అంది—'సోదరా, నా తప్పు కోసం ప్రాణమర్పించడానికైనా నేను వెనుదియ్యను. ఏమి జరిగిందో స్పష్టంగా చెప్పు.'

'నేను నిన్ను చంపడానికి వచ్చాను. నీ కంఠం నులిమి వేయడానికి..కాదు కాదు. వెయ్యిసార్లు బ్రతికీ వెయ్యిసార్లు చచ్చి కూడా నీవు ఎటువంటి మృత్యువుతో ఈడు కావో, అలాంటి మృత్యువు నీ కివ్వడానికి వచ్చాను. పాలీ, సోదరీ, నేటి నుండి నీవు జీవించలేదనీ, చచ్చావనీ అనుకో.'

'నాకు చచ్చిపోవడం చేతనవును సోదరా, సమయం వచ్చినప్పుడు ప్రాణమివ్వడానికి

భయపడను. కాని వైశాలిలోని వాళ్లంతా నన్ను చంపడానికి ఆతురులై ఉండడానికి కారణమేమో మాత్రం నాకు చెప్పు. నేనింత వరకు చావలేదు. చెప్పు సోదరా, ఆగకు. నేనూ లిచ్ఛవీయనే.'

'అందుకే నీకు చెప్పగలుగుతున్నాను. రేపటి నుండి నీవు మహానామునికి కాక వైశాలి అంతటికీ, లిచ్ఛవీయు లందరికీ చెందిన దానవవుతావు. తండ్రిగారు నిస్సంశయంగా తన చేతులతో పరిషత్తున కర్పించారు.' పాలికి గుండె ఆగి నట్లయింది. ఆనందుని పెదాలు కంపింపసాగాయి. స్వరం తీక్షణమైంది. అతడు అరచి ఇలా అన్నాడు. 'విన్నావా పాలీ నీవు నా సోదరివి, లిచ్ఛవీయ మహానాముని పుత్రికవు. ఇప్పుడు వేశ్యవయ్యావు! లిచ్ఛవీయుల ఈ ఆదర్శం త్యాగం. ఇది వైశాలికి గౌరవపూర్ణమైన కళంకం.'

ఈ సమయంలో పాలి మరణిస్తే బాగుండును. కాని చావలేదు. కారణం, ఆమె లిచ్ఛవీయ. ఆకస్మికమైన మానసికాఘాతం వల్ల ఆమె శరీరమంతా శిథిలమై మళ్లీ చైతన్యం పొందింది. అంధకార కూపంలో పడ్డ పిదప లేచి మెల్లగా వెలుగు లోకి వచ్చినట్లు పాలికి క్రమంగా బాహ్య ప్రపంచం స్మృతికి వచ్చింది. ఆమె అంధ కారం నుండి వెలుగులోకి రావడానికి ప్రయత్నింప సాగింది. చాలా దూరంలో ఉన్న అస్పష్టమైన ఏదో కాంతి కిరణం వైపు చూచి తన సమీపంలో ఉన్న అంధకారాన్ని మరచింది. గంభీరమైన సంశయ స్వరంతో ఆమె,

'ఏమి ఆజ్ఞ సోదరా?' అని అడిగింది.

ఆనందుని కఠోర హృదయం కరిగి పోయింది. వారాంగన అవడానికి ముందు అతడు తన సోదరి వీరాంగన అవడంచూశాడు. అతని హృదయం ముక్కలవుతోంది. భవిష్యం విన్న తరవాత పాలి తక్షణం తన జీవితంలోని మహదైశ్వర్యాన్నీ, సుఖాన్నీ సంతోషాన్నీ తన మనస్సులోంచి పార్రదోలింది. జనకునాజ్ఞకూ, వంశ గిత నియమాలకూ ముందు ఆమె మహారాణి పదవి వదిలేసింది. శరీరాన్ని తిరస్కరించి వేసింది. వ్యక్తిత్వాన్ని అణచి వేసింది. కాని హృదయాని కేమీ చెప్పలేకపోయింది. ఆ ఆవేశంలో ఆమె దాన్ని కూడా అణచివేసింది. ఆనందుడు సోదరి త్యాగాన్నీ, నిశ్చయాన్నీ చూశాడు. అతడక్కడ త్యాగం నిర్దాక్షిణ్యంగా

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## 1966 దీపావళి కథల పోటీ

ఎప్పటివలెనే ఈ సంవత్సరం కూడా 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక దీపావళి కథల పోటీ' నిర్వహించపోతున్నదని తెలుపటానికి సంతోషిస్తున్నాము. కథకులందరూ ఎప్పటివలెనే మాతో సహకరించి ఈ పోటీని జయప్రదం చెయ్యగలరని ఆశిస్తున్నాము.

**మొదటి బహుమతి రు. 1100**

**రెండవ బహుమతి రు. 750**

**మూడవ బహుమతి రు. 500**

### నిబంధనలు

1. కథలు స్వంత రచనలయి ఉండాలి. ప్రతి కథతోనూ రచయిత అది తన స్వంత రచనేనని, దేనికీ అనువాదంకాని, అనుసరణకాని కాదనీ హామీ రాసి పంపాలి. ఈ హామీ వేరే కాగితంమీద కాక కథ వ్రాతప్రతిమీదనే రాసిఉండాలి.
2. కథలు తెలుగువారి జీవితానికి సంబంధించి ఉండాలి.
3. వ్రాత ప్రతిమీద 'దీపావళి కథల పోటీకి' అని స్పష్టంగా రాయాలి. కాగితానికి ఒకవైపు మాత్రమే సిరాతో రాయాలి. రచయిత పేరు, పూర్తి చిరునామా కూడా వ్రాత ప్రతిమీద స్పష్టంగా రాయాలి. రచనలు 12 అరఠావు (ఎక్సర్సయిజు నోట్‌బుక్ పేజికి రెండురెట్లు) పేజీలకు మించరాదు.
4. కవరుమీద ''దీపావళి కథల పోటీకి'' అని స్పష్టంగా రాయాలి. పోటీకి రచనలు 'సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, 7, తంబుచెట్టివీధి, మద్రాసు—1' కి పంపాలి.
5. పోటీ గడువు తేదీ 30—9—1966. ఆ తేదీ తర్వాత మా కార్యాలయం చేరిన కథలని మామూలుగా ప్రచురణకి పరిశీలిస్తాము.
6. పోటీలో బహుమతి పొందిన కథలని 'దీపావళి ప్రత్యేక సంచిక'గా 1—11—1966 తేదీ కల ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురిస్తాము.
7. పోటీ తుది నిర్ణయం ఆంధ్ర సచిత్ర వారపత్రిక సంపాదకుడిదే. ఈ విషయమై ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరపటానికి వీలులేదు.
8. వ్రాతప్రతులని ఎటువంటి సందర్భంలోనూ తిప్పి పంపటానికి సాధ్యంకాదు. పోటీలో పాల్గొనే వారు తమ రచనలతో తపాలా బిళ్లలు అతికించిన స్వంత చిరునామాగల కవర్లు పంపనవసరంలేదు.
9. పోటీలో బహుమతి పొందక మామూలుగా ప్రచురణకి స్వీకరించిన కథల రచయితలకి ఆవిషయం ప్రచురించేముందు తెలుపుతాము.

స్వీకరింపబడడం చూశాడు. గర్వం, ఆనందం, వేదన వీనితో అతని హృదయం నిండిపోయింది. భావావేశంలో అతడు సోదరిని హృదయానికి హత్తుకున్నాడు. కళ్ల నుండి అశ్రుధార ప్రవహిస్తోంది.

'సోదరీ, విను. నీవు రాజగృహానికి వెడితే లిచ్ఛవీయ గణం తమ రాజకన్య ఒక మాగధీయుని చేత ఓటు పడ్డం చూచి బింబిసారుని వధింపక మానదు. రాష్ట్రమంతటిపై ఆపదాంబుదాలు పరిక్రమిస్తాయి. నీ వాత్మహత్య కావించుకుంటే జనకుని వచనం నిష్ఫలమవుతుంది. మాగధీయుని వివాహమాడడం వల్ల నీవు ఆత్మహత్య చేసకున్నావని తెలిసికొని బింబిసారుడు, లిచ్ఛవీయుల మీద పగ సాధిస్తాడు. సోదరీ నీవు అతని వెంట వెళ్లలేవు. ప్రేమించలేవు. ఆత్మహత్యా చేసుకోలేవు. నీ మొదటి పని బింబిసారునికి తెలుపు. నేను శీఘ్రంగా నాయన గారి దగ్గరకు వెళ్లాలి..' ఇలా అని అతడక్కడి నుండి వెళ్లిపోయాడు. ఆవిశాల కక్ష్యలో పాలే ఉంది. అప్పుడు నిర్దోషి, నిరపరాధిఅయినపాలి ఏకాకిగాను, నిస్సహాయము గానూ ఉంది. రాత్రి గడిచింది. రెండవ దినమూ గడిచింది. అది అర్ధరాత్రి. బ్రహ్మదత్తుడు, సంజయుడు సంపూర్తిగా ఉండి తమ మహారాణిని తీసుకుపోడానికి వచ్చారు. ఆనందుడు రాగానే బింబిసారుడు శీఘ్రంగా పోయే ఏర్పాటు చేయడాని కారంభించాడు. అతని హృదయం ఆనందంతో పులకితమవుతోంది. ప్రేమ పరీక్షలో హృదయాన్ని ఓడి, అతడొక గొప్ప విజయాన్ని పొందాడు. అతడు తన ప్రేయసితో బాటు ఒక గొప్ప రాష్ట్రాన్ని తనదిగా చేసుకున్నాడు.

# ఆమ్రపాలి

అతని హృదయం రాజగృహంలో ప్రవేశించి మిక్కిలి కోలాహలంతో ధ్వజారోహణం మధ్య భయంకర నాదంతో ప్రపంచంలో అతని కంటె సుఖవంతుడైన రాజెవ్వడూ లేడని ప్రపంచానికి వినిపించగోరుతోంది. ఏర్పాటు తొందరలో అతడు పాలిని కూడా కలుసుకోలేకపోయాడు. పాలి తన్నాతని దృష్టిలో పడనీయలేదు. రేవా నేర్పుతో ఈ పనిలో ఆమెకు తోడ్పడింది. కాని బింబిసారుని మనస్సు పాలిని కలిసికోడానికి ఆకులపడుతోంది. అతడు అక్కడి నుండి అర్ధరాత్రిలో మాట్లాడకుండా పోవలసి ఉంది. దీని కేర్పాటు రెండు దినాలకు ముందే జరిగింది. సమయంకాగానే దేవిని తీసుకొనిపోడానికి మహాలులోకి రావాలని రేవా చెప్పింది. వెలుపల రథాలున్నాయి. అభిరాముడు నిశ్శబ్దంగా ఒకప్పుడిక్కడికి ఒకప్పుడక్కడికి పోయి పనిలో నిమగ్నుడైనట్లు నటిస్తున్నాడు. పాలిని కలిసికోడానికి బింబిసారుని పాదాలు నేలపై నిలవడం లేదు. బ్రహ్మదత్తుడు వెళ్లడానికి ముహూర్తం కూడా నిశ్చయించాడు. ఈ గడియ ఇద్దరి జీవితంలో అద్భుత పరివర్తనం కలిగిస్తుందని జ్యోతిష్కుడు చెప్పాడు. సరిగా అర్ధరాత్రి సమయంలో బింబిసారుడు దుస్తులు ధరించాడు దేవపురుషులకు వలె మస్తకంపై మకుటం ఉంది. చేతులలో రత్న జటితమైన ఖడ్గముంది.

ఆ సమయంలో తలుపు తెరచిన చప్పుడయింది. బింబిసారుడు కళ్లెత్తి చూశాడు. అక్కడ పాలి నిల్చుంది.

బింబిసారుడు 'పాలీ' అన్నాడు. విస్మయం వల్ల అతడంత కంటె ఎక్కువ మాట్లాడలేకపోయాడు. అతడు ముగ్ధుడై పాలిని చూస్తున్నాడు. పాలి సామాన్య వస్త్రాల్ని ధరించి ఉంది. ఆమె బింబిసారుణ్ణి చూస్తోంది. నేడామె బింబిసారుణ్ణి రాజవేషంలో చూచి స్తంభితురాలైంది. ఆ సమయంలో బింబిసారుడు మానవుడు కాడు. తావతంస (బౌద్ధశాస్త్రంలో వర్ణింపబడిన ఇంద్ర సామ్రాజ్యం) శక్రునిలాగ కన్పిస్తున్నాడు. హృదయం మళ్లీ కల్లోలితమై కంపించ సాగింది. కాని పాలి నిర్దయతో దాని నణచివైచింది. పెదవులపై బలవంతంగా ఈర్ష్యను తెప్పించడానికి ప్రయత్నించింది. కళ్లల్లో కృత్రిమ క్రోధం, ధిక్కార భావం తేవడంలో కృతకృత్య అయింది. ఆమె అక్కడే స్థిరంగా నిల్చుంది. బింబిసారుని హృదయంపై ఎవడో వజ్ర ప్రహారం చేసినట్లయింది. ఆమె స్వరం మారింది. హఠాత్తుగా పాలి వైపు పరుగెత్తి అన్నాడు. 'ఈ వస్త్రాలెందుకు ధరించావు, పాలీ? నందిగ్రామం విడిచి పెట్టే సమయమైంది.'

'అవును, నీకూ నాకూ కూడా.

బింబిసారుడు పాలి నిరాశాపూర్ణస్వరానికి విస్మితుడై రెండడగులు వెనక్కివేశాడు.

'మగధ మహారాజు మనస్సులో కల్పించిన ఆశలన్నీ గగన కుసుమాల లాగ మిధ్యాసత్యాలవడం వల్ల అతడు నందిగ్రామం విడిచి వెళ్లాలి.'

'ఎవడైనా కొత్త శత్రువు జన్మించాడా ఏమిటి?' అని బింబిసారుడు గంభీరుడై ప్రశ్నించాడు.

'అవును, నీ యెదుటే నిల్చున్నాడు' అని పాలి తన శక్తినంతా ఉపయోగించి తననూ, తన కళ్లనూ, కంఠాన్నీ కోపతిరస్కారపూరితం చేసి మళ్లీ చెప్ప నారంభించింది. 'మగధపతీ, నీవు ప్రేమింప గోరుతున్న దొక లిచ్ఛవీయ కన్య అని నీ వామెను ప్రేమించడానికి ముందే బాగా ఆలోచించి ఉండవలసింది. ముందెన్నడూ ఏ లిచ్ఛవీయ కన్యనూ, ప్రేమ పరాజితగా చేసే మిధ్యాగర్వాన్ని చూపకు.. లిచ్ఛవీయుల దేశం నుండి సురక్షితంగా స్వదేశానికి మళ్లీ రాగలిగినందుకు రాజగృహం చేరగానే నీ కులదేవతకు అర్ఘ్యం ఇచ్చి ఆమె ఉపకారాన్ని మన్నించు. ఈ ప్రాసాదంలోనూ, దీనికి వెలుపలా అనేక మహారథులైన యోధులు ఇప్పుడు నిల్చి ఉన్నారు. కావలిస్తే



వాళ్లు మగధరాజును ఇష్టం వచ్చినట్లు దండించగలరు. అదృష్టంవల్ల నీవు ఒక మహా లిచ్ఛవీయుని అతిధివై అతని సంరక్షణలో ఉన్నావు..నీవు మాకు విరోధివి. లిచ్ఛవీయులు ఈ శత్రు సమ్మానాన్ని బాగా ఎరుగుదురు.. వేషం మార్చి నాటక మాడ్డం మాకు తెలియకపోయినా, పవిత్ర హృదయంతో క్షమించడం మేము ఎరుగుదుము. ఇప్పుడు శీఘ్రంగా ఇక్కడినుండి వెళ్లిపో...'

బింబిసారుడలాగే నిల్చున్నాడు. ఆమె తనకు చెందిన పాలే అని అతనికి నమ్మకం లేకుండా ఉంది. పాలితో మాట్లాడాలని అతనికి గల కోరిక ఆమె మాటలు విని అదృశ్యమయింది. అతడేమీ మాట్లాడ లేదు. కాని అతడు పాలిని ఏ దృష్టితో చూశాడో, ఆ దృష్టి రాతినైనా ముక్కలు చేయగలనట్లున్నది.

ఆ సమయంలో పాలి స్థానంలో మరొకతె ఎవరైనా ఉంటే అక్కడ ఆగనైనా లేదు. ఏమి చెప్పినా వ్యర్థమని బింబిసారుడు తలచాడు. శయ్యపై విసరియున్న ఖడ్గాన్ని అతడు మళ్లీ ఎత్తి మూర్తివలె నిశ్చలంగా ఉన్న పాలి దగ్గర నుండి వేగంగా వెళ్లిపోయాడు.

ఒక రథం వెడుతున్నట్లు పాలికి విన్పించింది. ఎవడో అశ్వాలను వాని తోలూడిందో అన్నంత బలంగా కొరడాతో కొట్టాడు. పాలి కంపించింది. ఆమె తన హృదయంలో కొరడా వేదన అనుభవించింది. రథం వెళ్లిపోయింది. పాలి స్పృహ తప్పి అక్కడే పడిపోయింది.

ఆనందుడు ఒక్కసారిగా లోపలికి పరుగెత్తుకొని వచ్చాడు. అతడు వెలుపల నిలబడి నిశ్శబ్దంగా పాలి మాటలు ఆలకిస్తున్నాడు. అతడు తన సోదరి అపూర్వ త్యాగాన్నీ, హృదయాన్ని పెకల్చి అవతలకు విసిరివేయగల ధైర్యాన్నీ చూస్తున్నాడు. పాలీ బింబిసారుల మాటలు వింటూ అతడు సమస్త ప్రపంచం యెడల ఏవగింపుతో నిండిపోయాడు. అభాగ్యురాలైన తన సోదరి హృదయంలో బింబిసారుని యెడల ఎంత ప్రేమ కలదో అతడెరుగును. అశ్రుపూరిత నేత్రయైన సోదరిని ఉత్సంగాని కెత్తుకొని, హృదయానికి హత్తుకొని అతడు 'సోదరీ, నా సోదరీ' అని కేక వేశాడు.

వెలుపల నిలబడిన అశ్వాలు సకిలించాయి. ఎక్కడో దూరంగా ఒక రథం వాయు వేగంతో పరుగెత్తి పోతూంది.

(సశేషం)

# ఇదో రకం పిచ్చివాడు!

ఒక్క కప్పు కాఫీకే
దిక్కు లేని వాడు తాను
అందరికీ అమృతాన్ని
అందిస్తా నంటాడే!

అరవైలా నడవ లేని
అర్భకుడై యుండి తాను
విను వీధులలో హాయిగ
విహరిస్తా నంటాడే!

ప్రియురాలిని క్షణం సేపు
విడిచి పెట్టి ఉండ లేడు —
తానే ఋషియై (బ్రహ్మము) తత్వము
దర్శిస్తా నంటాడే!

పూటకి గతి లేని తాను
భూమి జనుల నందరినీ
నవరసాల విందులతో
నలరిస్తా నంటాడే!

కట్టుకొన్న యిల్లాలికి
కాసైనా లేదు కాని —
నా ఊహా సుందరి కీ
నగ లిచ్చా నంటాడే!

అంతా యేడుస్తూంటే
అతడొకడూ నవ్వు తాడె!
ప్రపంచ మేమైన తనకు
పట్టనట్లు ఉంటాడే!

అంద మైన వస్తువులను
అదోలాగ చూస్తా డే!
మనలో ఒకడుగ ఉంటూ
మరోలాగ ఉంటాడే!

ఏదో వింటున్నట్లుగ
ఏదో కంటున్నట్లుగ
పదుగురిలో ఉండి కూడ
పరాకుగా ఉంటాడే!

ఆడుదాని మొగం చూసి
అది చందురు డంటాడే!
సరస్సులో కలువ పువ్వు
జాబిలి చెలి అంటాడే!

ఆకాశం వంక చూసి
అది పందిరి అంటాడే!
ఆ నక్షత్రాలు చూసి
అవిగో! పువ్వు అంటాడే!

పిచ్చివాడు! — 'ఈ లోకం
పిచ్చి' దనే పిచ్చి వాడు!
ఇది కవిత్వ మంటాడే!
ఇది తెలియం డంటాడే!

ఏమనుకోవా లితని
యీ విడ్డూరపు మాటలు
ఇదో రకం పిచ్చివాడు!
అదో రకం పిచ్చివాడు!!

వక్కలంక లక్ష్మీపతిరావు.




ఒక రోజున తైమూరు మౌల్వీతో ఇల్లా అన్నాడు.

"మన ఆస్థానంలో మంచి జ్యోతిష్కుడొకడు ఉండాలయ్యా. కాని, సరియైన వాడెవడూ దొరకడం లేదు. అన్నట్టు నీకీవిద్యలో ప్రవేశం ఏమీ లేదూ?"

"లేకేమి దేవర! కాని ఒక్క షరతు. నేనూ, నాభార్య—ఇద్దరమూ కలిసి జ్యోతిష్కులుగా ఉండడానికి ప్రభువులు సమ్మతిస్తే మాకు అభ్యంతరం లేదు" అన్నాడు మౌల్వీ.

"నీ భార్య కూడా ఎందుకయ్యా మధ్యను?"

"కారణం లేనిదే ఈ మౌల్వీ ఏదీ చెప్పడు ప్రభూ!..... ఇంట్లోనే నేమాట చెప్పినా నా భార్య సరిగ్గా దానికి వ్యతిరేకంగా మాట్లాడుతూ ఉంటుంది. ఉదాహరణకి, ఆకాశం కేసి చూసి, "రేపు వర్షం కురుస్తుంది" అని నేను అన్నాననుకోండి, తక్షణం నా భార్య 'రేపు చచ్చినా వర్షం కురవదు' అంటుంది. 'ఈ ఏడు పంట బాగా పండుతుంద'ని మా ఆవిడ అంటే, 'అబ్బే! పంటలు ఈ ఏడు బొత్తిగా బాగుండవు' అని నేను అంటాను. ఈ విధంగా అప్పుడే కొన్ని ఏళ్ల నుంచి జరుగుతోంది. దాని మాట అయినా నిజం అవుతుంది, లేదా నాదయినా నిజం అవుతుంది. మరి మూడో పద్ధతి అంటూ ఉండదు. కనుక జ్యోతిష్కుడినిగా ఉండాలంటే నా భార్యతో కలిసే ఉండాలి.' ●




మౌల్వీ నసిరుద్దీన్ కథలు
—శ్రీమహీధర్ నళినీ మోహన

మౌల్వీ నసీరుద్దీన్ ఉంటున్న ఊళ్లో ఒక ముసలివాడు ఉండేవాడు. ప్రతి రోజూ అడవికి వెళ్లి, కట్టెలు కొట్టి, అమ్మి, గంజి కాచుకుని తాగేవాడు.

ఒక రోజున అతడు హుషారుగా చాలా కట్టెలు కొట్టి, పెద్ద మోపు తయారు చేశాడు. కాని, అంత మోపు ఎత్తుకోలేక చాలా అవస్థ పడుతున్నాడు. అంతలో పొరుగూరి వాడొకడు ఆదారి వెంట వెడుతూ అక్కడికి వచ్చాడు. అతడిని చూడగానే ముసలి వాడి ముఖం వికసించింది.

"బాబ్బాబు! ఈ [illegible] కూసంత నా నెత్తికి ఎత్తండి!"

"సరే ఎత్తినందుకు నా కేమి ఇస్తావు?"

ఆ వ్యక్తి వేష భాషలు చూస్తే నిజంగా తన దగ్గర ఆ పనికి ప్రతిఫలం ఆశించే వాడిలా లేడు. ఏదో తమాషాకి అంటున్నాడని పించింది.

"నా దగ్గిర ఏటుంది బాబూ ఇయ్యడానికి? ఏం లేదు"

ఆ వ్యక్తి మారు మాట్లాడకుండా మోపు నెత్తికి ఎత్తి "నా కిస్తానన్న 'ఏంలేదు' ఇల్లాపడెయ్యి" అని డబాయించాడు.

ముసలివాడు బ్రతిమాలేడు.

"నేను సదుంకోని వోణ్ణి. నన్ను ఒగ్గెయ్యండి బాబూ!"

ఆగడసరి అంత సులభంగా విడిచి పెట్టలేదు.

"నేను ముందే అడిగాను, ఏమి ఇస్తానని, మళ్లీ 'ఏంలేదు' అన్నావు

నేను ఒప్పుకుని పోవు వెత్తాను. నా 'ఏంలేదు' నాకు పడెయ్యి. నాదారిన నేను పోతాను."

ముసలివాడు ఎంత ప్రాథేయ పడ్డా ఆ పరదేశి వినలేదు. ఆఖరికి ఇద్దరూ కలిసి ఆ ఊరి కాజీ దగ్గరకు వచ్చారు.

న్యాయ నిర్ణయం ఎలా చెయ్యాలో అర్థంకాక కాజీ మౌల్వీ నసీరుద్దీన్‌ని పిలిపించాడు.

"రావయ్యా రా! ఇలాంటి చిక్కులు నువ్వేమైనా విడదీయ గలవేమో చూడు."

మౌల్వీ వారిద్దరి వాదాలూ జాగ్రత్తగా విన్నాడు. చివరికి పరదేశితో ఇలా అన్నాడు.

"నువ్వు చెప్పింది న్యాయమే మరి. వాగ్దానం అంటూ చేశాక ఇచ్చి తీర వలసిందే. కాని, పాపం వాడు చాలా బీదవాడు. 'ఏంలేదు' వాడి దగ్గర ఏం ఉంటుంది? పోనీ వాడి బదులు నే నిస్తే సరిపోతుందా?"

పరదేశి అంగీకరించాడు.

"ఏదీ నీ అరచెయ్యి ముందుకు జాపి అందులో ఏ ము ం దో చూడు"

పరదేశి తన చేతిలో చూచు న్నాడు. అది వట్టి ఖాళీ చెయ్యి.

"ఏం కనిపించింది?" — రెట్టించాడు మౌల్వీ.

"ఏంలేదు — ఏమీ లేందే!"

"నీ కియ్య వలసిన 'ఏంలేదు' అదే. ఇహ బయటికి నడు."




ఒకనాడు మౌల్వీ నసీరుద్దీన్ పట్టణం వెళ్లాడు. విశాలమైన వీధుల వెంట తిరుగుతూవుండగా ఒకచోట బ్రహ్మాండమైన భవనం ఒకటి కనిపించింది. ఆభవనం కట్టుబడి మౌల్వీకి చాలా నచ్చింది. చాలాసేపు అక్కడే నిలువబడి తదేకంగా చూడసాగాడు.

ఆ ఇల్లు నగర పర్యవేక్షకునిది. ఎవరో పల్లెటూరిరైతు తన ఇంటిని ఆశ్చర్యంగా చూస్తూ ఉండడం గమనించాడు ఇంటి యజమాని. అతనికి కించిత్తు గర్వం కలిగింది. ఆ పల్లెటూరి ఆసామీని వెక్కిరించాలని గుబగుబలాడేడు. మౌల్వీ దగ్గరకు నడిచి వచ్చేడు.

"ఏమయ్యా! ఏం జరిగింది? ఎందుకు అల్లా చూస్తున్నావు ఇంటి కేసి?"

"ఇల్లు చాలా బాగుంది. నాకు నచ్చింది. కాని మరీ పెద్దదిగా ఉంది. అదే అనుకుంటున్నాను. ఇంత పెద్ద ఇల్లు ఎందుకు కట్టేరో?" అన్నాడు మౌల్వీ.

"ఈ భవనం ఏమిటనుకుంటు న్నావు?"

"బహుశా కాపరాలు ఉండే ఇల్లే అనుకుంటా"

"కాదు పొరబడ్డావు. ఇది గుర్రాల శాల!" అని నగర పర్యవేక్షకుడు వెకిలిగా నవ్వేడు.

ఆ వ్యక్తి తనను వెద్దేవాచేస్తున్నా డని మౌల్వీ గ్రహించాడు. ఆ సంగతి పైకి తెలనీయకుండా ఇలా అన్నాడు.

"అవును. నేను అన్నదీ అదే. ఇది గుర్రాలూ, గాడిదలూ కాపురం ఉండే ఇల్లనుకో."

ఈ కథలను గురించి రెండు మాటలు చెప్పాలి.

నేను మాస్కో యూనివర్సిటీలో పి. హెచ్. డి. కి కృషిచేస్తున్న రోజులలో

## తుది మాట

నా అజర్ బైజాన్ మిత్రులు సంభాషణలలో తరుచుగా మౌల్వీనసీరుద్దీన్ కథలు చెప్తూ ఉండేవారు. అవి వింటున్నప్పుడు మనదేశపు తెనాలి రామలింగడు, బీర్బల్, మర్యాదరామన్న మొదలైన వారిని గురించి ప్రచారంలో ఉన్న కథలు జ్ఞాపకం వచ్చేవి. సున్నితమైన హాస్యం, రిపార్టీ ఈకథలలో కనిపిస్తుంది. కొన్నిచోట్ల మహా మేధావిలా కొన్నిచోట్ల వెర్రిబాగుల వాడిలా, ఒక్కొక్కచోట మన విదూషకుని ధోరణిలో వేరొకచోట గొప్ప తత్వవేత్తలా కనిపిస్తాడు. ఇతనికి సత్యం మీదా, న్యాయం మీదా ఉన్న గౌరవం సంఘంలో బాగా వేళ్ళు పాతుకున్న దేవుని మీద, మత విషయాలమీద లేవు. కొరాన్ మహిమ, దైవభక్తి, పంపకం వంటి కథలలో ఈవిషయం తేటతెల్లమవుతుంది. బడాయి, చెయ్యి పుచ్చుకోవడంవంటి కథలలో మత గురువులను వెక్కిరించడం కనబడుతుంది. స్వర్గం—నరకంవంటి కథలలో ఇతనికి ధనికులమీద ఉన్న చిన్న చూపు వెల్లడి అవుతుంది.

అజర్‌బైజాన్ జానపద గాథలలో తరుచు వినవచ్చే ఈ నసీరుద్దీన్ మౌల్వీ, కుంటి తైమూరు కాలంలో జీవించినట్లు ఈకథలలో ఉన్నది కాని ఇది నిజమోకాదో సరిగ్గా తెలియదు. అసలు ఇటువంటి వ్యక్తి ఒకడు ఉన్నాడో లేక అంతా కల్పితమో తెలియదగ్గ చారిత్రకాధారాలు ఏవీలేవు.

మౌల్వీ పేరు ఎత్తితే ఏడు కథలు చెప్పాలని అజర్‌బైజాన్‌లో వాడుక అట. సరిగ్గా ఇదేవాడుక మన తెనాలిరామలింగని కథలకూ వుంది ఈ మౌల్వీ కథలలో కొన్ని మన దేశపు కథలను పోలినవి కూడా కనబడతాయి. ఏవి ముందు ఏవి వెనుక అను తర్కం పక్కకు పెట్టి నేను విన్న కథల నన్నింటినీ నోట్ చేసుకున్నాను. మన దేశానికి తిరిగి వచ్చాక పిల్లకాయలకు చెప్తూఉంటే వాళ్ళీకథలు వినడానికి చాలా ఉత్సాహం చూపుతూ వచ్చారు. ఒక్కొక్క చోట ఆ హాస్యపు లోతులు చూపవలసి వచ్చినా చెప్పినప్పుడు చాలా ఆనందించారు.

ఆ ఆనందాన్ని తెలుగు ప్రజలందరితో కలిసి పంచుకోవాలనే ఆశతో వాటినన్నింటినీ కాగితంమీద పెట్టేను. ఈ కథలను ప్రచురించి తెలుగు పిల్లల కందించిన ఆంధ్ర పత్రికా సంపాదకులకు కృతజ్ఞుణ్ణి.

—మహీధర నళినీమోహన్ ●

# నొప్పి వలన పురుషుల కంటే
# స్త్రీలకు బాధ ఎక్కువగా వుంటుందా?
# బహుశా.
# కాని మాకు నిశ్చయంగా
# తెలిసిన దేమిటంటే, నొప్పి నుండి
# నివారణ పొందడానికి
# కోట్ల కొలది స్త్రీలు
# **అనాసిన్** తీసుకుంటారు.
# కేవలము స్త్రీలే గాక
# పురుషులు కూడా!

లక్షణములు: తల నొప్పి, జలుబులు మరియు ఫ్లూ, పంటి పోటు,
వొళ్ల నొప్పి, కండరముల నొప్పి.
మోతాదు: పెద్దవారికి 2 బిళ్లలు. పిల్లలకు 1 బిళ్ల. ఇది ఎంత సులభమైన విషయము!




## అనాసిన్

చాలా మంచిది

ఎందుకనగా

అది 4 విధాల పనిచేస్తుంది



ASP/ANACIN-5 TEL.

Registered user: GEOFFREY MANNERS & COMPANY LIMITED

# లక్ష్మీపతి

(12 వ పేజీ తరువాయి)

ఎందరో వున్నారు లక్ష్మీపతీ! మరి ఆత్మ హత్యలే సమస్యలకు పరిష్కారాలయ్యే ట్లయితే వాళ్ళందరూ ఏం కావాలి కనుక."

"నువ్వు ఇక్కడే, మా యింట్లోనే వుండిపో" అనేటప్పుడు అతనికి ఇలా చెప్పాను. ఆరోజు నుంచి లక్ష్మీపతికి కాస్త చదువు కూడా చెప్పడం ప్రారంభించాను.

లక్ష్మీపతి పూర్తిగా మారిపోయాడు గానీ, అతని నుదుటి మీది మచ్చ మాత్రం గతానికి స్మారకచిహ్నంలా అలాగే వుండి పోయింది. అలా రెండు సంవత్సరాలు గడిచి పోయాయి. అకస్మాత్తుగా వోనాడు లక్ష్మీపతి మాయ మయ్యాడు. అతని కోసం ఎంతగానో వెతికించాను. లాభం లేక పోయింది. కొంతకాలం గడిచిన తర్వాత ఎవరో, ఎక్కడో రైలుకింద పడి ఆత్మ హత్య చేసుకున్నాడని తెలిసింది. అతను లక్ష్మీపతేనా? కాదేమో అనుకున్నాను. అతనికి ఇప్పుడు ఆత్మహత్య చేసుకోవలసి నంత 'అన్యాయం' ఏం జరిగింది కనుక? —ఆ తర్వాత లక్ష్మీపతిని గురించి మర్చి పోయాను. అతని పేరు జ్ఞాపకం వచ్చి నప్పుడల్లా నాకు ఎందుకనో నవ్వొచ్చేది... కళ్ళ ముందు గతం కరిగి పోవడంతో చేతిలో మాగజైను జారిపోయింది.

* * *

"ఇక ఆలోచనలన్నీ మానేసి ముందు ఈ టిఫిన్ తీసుకోండి" లక్ష్మీపతి స్వయంగా బిస్కెట్ల పళ్ళెంతో వస్తూ అన్నాడు. లక్ష్మీపతిని పరిశీలనగా చూచాను. ఈ సారి అతని తల మీద టోపీ లేదు. నా దృష్టి అతని నుదుటి మీది మచ్చ మీద పడేసరికి ఉలిక్కి పడ్డాను. సరిగ్గా అదే మచ్చ. ఆ మచ్చ కూడా అలానే వుండేది.... అయితే........

"లక్ష్మీపతీ..... ల....క్ష్మీ.... ప...తీ.... నువ్వేనా..... నువ్వు.. బతికే.... వున్నావా..." సంతోషం పట్టలేక పెద్దగా అరవ బోయాను కాని, గొంతులోంచి మాటలు సరిగ్గా రాలేదు. అతను చేతిలో పళ్ళెన్ని బల్లమీద పెట్టి నా పాదాల దగ్గర కూర్చుని,

"నన్ను క్షమించండి మాస్టారూ!... మీ మనస్సుకు కష్టం కలిగించాను. అంత ఆదరంతో నన్ను చూచినా కాని, మీకో చెప్పకుండా పారి పోయాను. నన్ను క్షమించండి" అతని రెండు చేతులు నా పాదాల మీద పెట్టి అన్నాడు. అతని కనుకొలకుల్లో రెండు కన్నీటి బిందు వులు నిలిచి వున్నాయి.

"తప్పు నాయనా.... లక్ష్మీపతి.... లక్ష్మీపతీ"— నా మనస్సు ఆనందంతో ఉప్పొంగి పోతుంది. నేను చేరదీసిన లక్ష్మీపతి...... నా లక్ష్మీపతి బతికేవున్నాడు. నా కన్నీరు అతని తల మీద పడుతోంది. అతని కన్నీరు నా కాళ్ళను కడిగివేసే ట్లుగా వుంది.

అతన్ని లేవ తీశాను. అతను మౌనంగా నా ప్రక్కనే కూర్చున్నాడు. అలా కొన్ని క్షణాలు గడిచి పోయాయి. మే మిద్ద రమూ ఈ లోకంలో లేము. కొంత సేపటికి అతను అన్నాడు...

"ముందు ఈ టిఫిన్ తీసుకోండి మాస్టారూ"— ఆనందం, సంతోషం కన్నా ఆ బిస్కట్లు రుచిగా లేవు. తర్వాత అతను వోవల్టీన్— స్వయంగా— తెచ్చాడు. తాగాను.

"నువ్వు 'అమ్మగారు' అన్నప్పుడే అనుమానించాను. కానీ, నువ్వు బ్రతికే వున్నావని మాత్రం వూహించ...... " ఆపైన నాకు మాటలు రాలేదు.

అతను నవ్వాడు. ఆ నవ్వు చాలా హాయిగా వుంది.

"చనిపోయేవాడిని నన్ను బ్రతికించారు. అప్పుడు అను కున్నాను. మీరు కూడా అందరిలాగే నన్ను మోసం చేశారని... మీ ఆదరణలో ఆవేశాన్ని కొంత వరకే మర్చిపో గలిగాను. నాకు లోకం మీద అప్పుడు చాలా అసహ్యంగా వుండేది. బాగా ఆలోచిస్తే ఇప్పుడూ కూడా అలానే వుందను కుంటాను కాని, నేను, నాలాంటి వాళ్ళూ మీలాంటి వాళ్ళండ బట్టే....."

అతని మాటలను సగంలోనే ఆపి అన్నాను.

"లక్ష్మీపతీ— ఏం మాటలు అవి... అంతటికీ ఆ పరమాత్ముడే కారకుడు నాయనా......"

లక్ష్మీపతి మళ్ళీ ప్రారంభించాడు:—
"మాస్టారూ ఈ కలియుగంలో మీలాంటి వారి రూపంలోనే దేవుడు వుంటాడని నా నమ్మకం....." తర్వాత

సురేష్ ప్రొడక్షన్స్

# శ్రీ కృష్ణ తులాభారము

దర్శకత్వం
K. కామేశ్వరరావు, B.A.,

నిర్మాత
D. రామానాయుడు

ఆంధ్ర-సీడెడ్: విజయ రిలీజ్... నైజాం: వాణి... మైసూర్: విజయ పిక్చర్స్

అతను . దీర్ఘంగా నిట్టూర్చి అన్నాడు "మీ నుండి పారి పోయిన తర్వాత నేను ఎంత హీనంగా బ్రతకాలో— అంత హీనంగానూ బ్రతికాను. కాని ఆత్మహత్య చేసుకో దల్చుకో లేదు. ఒక ప్రదేశమని లేదు. ఒక ప్రాంతమని లేదు. ఇష్టం వచ్చినట్లుగా తిరిగాను. కొన్నేళ్ల తర్వాత ఒక మారు మూల ప్రాంతంలో ఒకరి ఆశ్రయంలో వుండి పోయాను. అలా కొన్నేళ్లు గడిచి పోయాయి."

"ఒకనాటి ఉదయం నేను నిద్ర లేచి చూచేసరికి నాచుట్టూ దాదాపు ఇరవై మంది నిల్చొని వున్నారు. అందరి కన్నా ముందు మా యజమాని నవ్వుతూ నిల్చుని వున్నాడు. నాకు అయోమయ మయింది. తర్వాత ఆయన చెప్పారు. నన్ను లక్ష్మి వరించిందని.... ఆయన ఒకనాడు ఇంట్లో అందరి చేతా లాటరీ టిక్కెట్లు కొని పించాడు. ఆ సమ యంలో నేనూ అక్కడే వున్నాను. ఆయన నన్నూ బలవంతం చేసి నా జీతంలో ఒక రూపాయి ముందుగానే అప్పుగా ఇచ్చి నాచేత ఆ టిక్కెట్టు కొనిపించాడు. ఆ లాటరీలో నాకు లక్ష.... లక్ష రూపా యలు వచ్చాయి మాస్టారూ—" అతనికి చిరు చెమటలు పోశాయి. కోటు జేబు లోంచి 'కర్చీఫ్' తీసి తుడుచుకుంటూ చెప్పాడు.

"నా డబ్బును ఆయన వ్యాపారంలో పెట్టాడు. నేను వ్యతిరేకించ లేదు. ఎందు కంటే ఆ లక్ష రూపాయలను నేను కష్టించి సంపాదించ లేదు. వ్యాపారంలో విపరీతంగా లాభాలు వచ్చాయి. ఆయన కొంత తీసుకొని నాకు కొంత ఇచ్చాడు. అలా ఆ డబ్బు పెరిగి పోవడం ప్రారం భించింది. నాకు ఎందుకో ఆ డబ్బుతో పాటు భయం కూడా పెరగ సాగింది. అందుకే ఓ రోజు నా యజమానితో ఇక నాకు డబ్బు అక్కర్లేదు. ఇప్పటి వరకూ వచ్చింది చాలన్నాను. అందు కాయన నవ్వాడు— ఫర్వాలేదులే అన్నాడు. నేను విన లేదు. నేను నా డబ్బు తీసు కొని ఆయన దగ్గర సెలవు తీసుకొని వచ్చేశాను."

లక్ష్మీపతి తన కథను ముగించాడు. చేతి రుమాలుతో మొహాన పట్టిన చెమ టను గట్టిగా తుడుచుకుని నావేపు చూచాడు.

ఈ మారు లక్ష్మీపతి నాకు చాలా కొత్తగా కనుపించాడు. 'డబ్బు వద్దు'— అనుకునే మనుష్యులు కాని,— 'ఈ డబ్బు చాలు'— అనుకునే వాళ్ళు కాని నాకు ఈ నాటికి కన్పించ లేదు.— ఒక్క లక్ష్మీపతి తప్ప. లక్ష్మీపతి డబ్బును, లాభంలో అతని వాటాలను అంత న్యాయంగా, సక్రమంగా ఇచ్చి వేసిన అతని యజమాని లాంటి వాళ్ళు కూడా చాలా అరుదు.

లక్ష్మీపతిని ఒక ప్రశ్న అడుగుదామా వద్దా అని చాలా సేపు తటపటాయించాను అతను నా అవస్థ గమనించాడులా వుంది "ఏమిటి మాస్టారూ" అన్నాడు. 'ఏం లేదు' అందామను కున్నాను కానీ అలా అనలేక పోయాను. కొంత సేపైన తర్వాత అన్నాను:

"లక్షలను కోట్లు చేసుకో వలసిన వాడివి నీకు డబ్బంటే అంత విరక్తి ఎందుకయ్యా"

నా ఈ ప్రశ్నలో అతనికి పెళ్ళ యిందో లేదో నన్న భావం వ్యక్తమయ్యే వుంటుంది— లక్ష్మీపతికి.

నా ప్రశ్నకు లక్ష్మీపతి నవ్వి అన్నారు: "ఓ సారి ఇలా రండి మాస్టారూ—" అతను నన్ను ఓ పెద్ద బీరువా దగ్గరకు తీసుకు వెళ్లాడు. అతను బీరువా తలుపు తీశాడు. ఆ బీరువాలో అరలన్నీ ఖాళీగా వున్నాయి— ఒక్కటి తప్ప. ఆ ఒక్క అరలో మాసిపోయిన చొక్కా, అలాంటిదే ఒక నిక్కరు మాత్రం వున్నాయి. అలాంటి గుడ్డలను ఎవరూ దాచుకోరు— పైగా అలాంటి బీరువాలో—. ఆ గుడ్డలను చూచిన పిదట నాకు నోటి మాట రాలేదు.

"మాస్టారూ వీటితో నేను యజ మాని దగ్గర పనిచేసే వాడిని. అంటే బ్రతికే వాడిని. నేను బ్రతకాలంటే నాకు ఆ జీవితం చాలు. అయితే విధి నన్ను మరోక విధంగా చూచింది. అందుకనే ఆ ఆశ్రమం, ఆ దశ తొలగి ఐశ్వర్య వంతుణ్ణయ్యాను. ఈ డబ్బుతో నేను నాజీవితాంతం వరకూ సుఖంగా, హాయిగా, దర్జాగా బ్రతక గలను. ఇంకా ఈ డబ్బును ఇలా పెరగ నివ్వడ మెందుకు చెప్పండి?" లక్ష్మీపతి సమాధానం నన్ను నివగితుణ్ణి చేసింది. మరేమీ మాట్లాడ లేక వెనక్కు తిరిగాను.

లక్ష్మీపతి బీరువా తలుపు వేసి నా వెనుకగా వస్తూ అన్నాడు.

"మాస్టారూ! నాకు ఒక్క కోరిక వుంది తీరుస్తారూ—"

అతని కంఠం మారి పోయింది. ఆశ్చర్య పోతూ వెనక్కు తిరిగి లక్ష్మీపతి వేపు చూచాను. ఈ మారు లక్ష్మీపతిలో గూడు కట్టుకునివున్న వృద్ధాప్యం బహిర్గత మైంది. ఇంత సేపటి నుండీ లక్ష్మీ పతిలో ఆ మార్పు నాకు కనిపించలేదు.

"ఏమిటి లక్ష్మీపతి— నావల్ల నీకు కోరిక తీరడమా—" ప్రశ్నార్థకంగా అతని వేపు చూస్తుండి పోయాను.

"అవును మాస్టారూ— తప్పక తీరుస్తారు కదూ—"

"తప్పక— నాచేతనైతే— తప్పక తీరుస్తాను".

నా సమాధానంతో లక్ష్మీపతి మొహంలో కోటి దీపాలు ఒక్క సారిగా వెలిగి నట్లైంది.

"నాకు తెలుసు మాస్టారూ— నా ఈ కోర్కెను మీ రొక్కరే తీర్చగలరు— అందుకనే నేను ఇంత దూరం ఇక్కడికి వచ్చి ఇన్నాళ్ళుగా మీ కోసం ఈ ప్రాంతా లలో నాకబు చేశాను. నాకున్న కోర్కె ఇదొక్కటే— అదే— మీరు సకుటుం బంగా వచ్చేసి నాతో— ఇక్కడే వుండి పొండి— నాకు 'నా' అనే వాళ్ళెవరూ లేరు..... నాజీవితంలో.... ఈ దశలో అలాంటి బంధాలు కలిగించుకోవాలన్న ఆసక్తి లేదు. నా జీవితంలో ఏర్పడిన ఈ మార్పుకు, తిరిగిన ఈ మలుపుకు మూల కారకులు మీరే. కాబట్టి మీరే ఈ మలుపునకు నిజమైన వారసులు..." లక్ష్మీపతి మాటలు ఆ తర్వాత నాకు వినిపించలేదు.

# చిత్రలహరి

## వలపు పిలుపు

రాజాను ప్రేమిస్తున్నదా తను? ఏమిటో చిత్రమయిన అనుభూతి కలుగుతుంది. అతణ్ణే తలచి మనసు మురిసిపోతున్నది. అడుగో, రాజా! తన సమీపానికే తన కోసమే వస్తున్నాడు. మాల హృదయం హరిణం వలె చెంగున గెంతింది. వస్తూ వస్తూ ఆగి పోయాడెందుకో మరి? "ఆగేవదేలా, దాగే వదేలా, జాగేలరా ఓ నా దొరా.. రావేల నేవేచి ఉన్నానురా!" అంటూ మాల రాజా కోసం వెతుకుతున్నది. సమీపాన్నే ఉండి ఆమెను అల్లరి చేస్తున్నాడు. "తొలిసారి నీవు తిలకించినావె, తిలకించి నా మేను పులకించి నావె, కనిపించి నీవు కలలోన, మదిలోన రాగాలు బలికించినావే" రాజాని తొలిసారిగా చూసినపుడే మేను పులకించింది. మనసులో ప్రేమానురాగాలు పొంగుతున్నవి. 'చెంతకు రాడేం? వచ్చి తనను గుండెలకు అదుముకుని, అందమైన కబుర్లు చెప్పడేం?' అనుకుంటూ ఆరాట పడుతున్నది ఆ కన్నె, మాలా మనసు. లేతగుండెలో జనించిన వలపు వెల్లువను హృద్యమంగా వివరించిన కలం జి. కృష్ణమూర్తిది. కమ్మదనాన్ని, కోయిల స్వరాన్ని గొంతులో నింపుకొని ఆలపించినది యస్. జానకి. కృష్ణమూర్తి కలానికీ, జానకి గొంతుకూ నిండుదనం తీసుకొని వచ్చిన స్వరకల్పకుడు కోదండపాణి. రాజా శోభన్‌బాబు, మాలా రాజశ్రీ. ఇది ఇందిరారమణ పిక్చర్స్ వారి "సత్యమేజయం" చిత్రానికి సంబంధించిన సన్నివేశం. ఈ చిత్రంలోని మిగిలిన ముఖ్యభూమికలలో గుమ్మడి, రామకృష్ణ, జి. వరలక్ష్మి, రమణారెడ్డి, రత్న, వాణిశ్రీ, రాజబాబు, బాలకృష్ణ, ముక్కామల, సత్యన్నారాయణ ఉన్నారు.

## జీవిత రహస్యం?

"శేఖర్" మెల్లగా పిలిచింది భామ.. "ఊ!" అన్నాడు శేఖర్ ఆమెనే తదేకంగా చూస్తూ. "మొదట్లో మీరు చాలా కోపిష్టి అనుకున్నాను" అన్నది భామ అతని జుట్టులోకి వేళ్లు జొనుపుతూ. "నువ్వు చాలా గర్విష్టి వనుకున్నాను" బదులు చెప్పాడు. "ఇప్పుడు?" అడిగింది భామ. "ఇప్పుడు నా కోపం, నీ గర్వం రెండూ ఎగిరిపోయినై. ఎంత విరోధులయినా అహం చంపుకొని మనసు విప్పి మాట్లాడుకుంటే మిత్రులైపోతారు ఇదే జీవితంలో రహస్యం!" వివరించాడు శేఖర్. భామ హృదయం తేలిక పడింది. నిండుగా నవ్వుకున్నది. శేఖర్ చూపులు సిగ్గు పరుస్తుండగా రెండు చేతుల తోనూ కళ్లను కప్పుకున్నది. ఏ. వి. యం. వారి "లేత మనసులు"కు చెందిన యీ దృశ్యంలో జమున, హరనాథ్ నటించారు. రేలంగి, పద్మనాభం, జి. వరలక్ష్మి, గీతాంజలి, బేబి పద్మిని మిగిలిన ముఖ్యతారాగణం. దర్శకత్వం: కృష్ణన్‌పంజు.



'సతీ అరుంధతి'లో జమున



'హమ్‌కహా జారహాహై'లో నీనా, హరనాథ్.

## సూర్యకాంతం అవస్థ :

"ఒరేయ్, ఒరేయ్, చంపేస్తుంటే యిలా వచ్చి చూడవేమిరా" అంటూ పెడబొబ్బలు



'మహాసతి అరుంధతి'లో (రంభ) గీతాంజలి



"అడుగుజాడలు"లో జమున, మిక్కిలినేని, రేలంగి, ఎన్. టి. రామారావు

# చిత్రలహరి

పెడుతున్నది సూర్యకాంతం. ఏం కొంప మునిగిపోయిందోనని చలం పరుగెత్తు కుంటూ వచ్చాడు. పిల్లలు సూర్యకాంతాన్ని చుట్టిముట్టి కొడుతున్నారు. "ఏమిటే బామ్మా!" అడిగాడు చలం. "ఇంకా ఏమిటంటావేమిట్రా యిలా చావ గొట్టేస్తూంటేను!" అన్నది సూర్యకాంతం విరుచుకు పడుతూ. వాళ్లను వారించాడు చలం. అయినా వినలేదు క్షురమేళం. "పోలీసులకు రిపోర్టు చేస్తాను" బెదిరించాడు.. "చేసుకో, మాకు పోలీసులంటే భయం లేదు" అన్నాడు ధీమాగా అల్లురామలింగయ్య



కన్నడ చిత్రంలో నటిస్తున్న కొత్త తార శారద.

గారి అబ్బాయి—వెంకటేశ్వరరావు. "మిల్ట్రీ వాళ్లని తీసుకు రమ్మంటావేమిటి బామ్మా?" అడిగాడు చలం. సూర్యకాంతం ప్రాణం తెలిక పడకపోయినా పడినట్లుయి "బాబ్బాబు ఆ పని చెయ్! ఈ యములాళ్ల బాధ తప్పుతుంది!" అన్నది. "అదుగో మళ్లీ యములాళ్లంటావు" అంటూ మంరోరెండు వేశాడు వెంకటేశ్వరరావు. సూర్యకాంతం వీళ్ల పోరు పడలేక విసుగెత్తిపోతున్నది. ఏం చేయలేని అసహాయ స్థితి. ఆమె స్థితి చూసి విజయనిర్మలకు నవ్వొచ్చినట్లుంది. అదే పనిగా నవ్వడం ప్రారంభించింది. "బాగుంది. రెడీఫర్ టేక్" అన్నారు దర్శకులు శ్రీ బి. ఏ. సుబ్బారావు. 'సిత్తి' తమిళ చిత్రం ఆధారంగా శ్రీకాంత్ ప్రొడక్షన్స్‌వారు నిర్మిస్తున్న చిత్రం సెట్స్ మీదది యీసందడి. రేలంగి, దేవిక, శోభన్‌బాబు, అల్లురామలింగయ్య కూడ యీ చిత్రం ముఖ్యతారాగణంలో ఉన్నారు.

## అపోహ-అంతర్యం

పార్వతి మనసు పగిలిపోతున్నది. విజయ్ మీద ఆమెకు అంతులేని ద్వేషం అంకురిస్తున్నది. తన తండ్రి మరణానికీ, తనకి వాడు సంప్రాప్తించిన అంధత్వానికీ కూడ అతనే కారకుడు. ఆడుతూ, పాడుతూ సాగిపోవలసిన తన యౌవన జీవితం యిలా నిర్వికారంగా, అంధకార బంధురంగా పరిణమింపజేసిన విజయ్‌ను క్షమింపజాలదు. తానెన్నటికీ క్షమింపజాలదు. అతనికి నాన్నా, తనూ ఏం అపకారం చేశారని ఇంతటి ఘోరమయిన శిక్ష విధించాడు? ఎందుకింతటి చిత్రవధకు గురి చేశాడు?'.. విజయ్ జ్ఞాపకం వచ్చినప్పుడల్లా ఆమె హృదయం అతని పట్ల అసహ్యంతోను, ఆవేదనతోను నిండిపోతున్నది. ఇది అపోహ..తనే విజయ్ అని తెలిస్తే పార్వతి తన నెంతగా అసహ్యించుకొంటుందో, ఎంతగా కుమిలిపోతుందో తనకి తెలుసు. అందుకే తను శేఖర్‌గా పేరు మార్చుకున్నాడు. ఆమె తండ్రి హాస్పిటల్‌ను నిర్వహించేందుకు పూనుకున్నాడు. పార్వతికి నిజం తెలిక తాను దుర్మార్గుణ్ణని తలుస్తున్నది. నిజం మెల్లగా ఆమెకు ఎరిగించాలనే తన తాపత్రయం. కాని, తానే విజయ్ అని తెలిస్తే యింకేమయినా ఉన్నదా? తను చెప్పేదేమీ వినిపించుకోకుండానే శూలాల్లాంటి మాటలతో హింసిస్తుందనే భయం అతన్ని పీడిస్తున్నది. సందర్భం ఏర్పడ్డప్పుడు పార్వతికి మెల్లగా జరిగిన సత్యాలు వెల్లడించాలనే వేచి ఉన్నాడు విజయ్. ఇది అతని అంతర్యం. ఈ రెండు హృదయాల వేద



'లేతమనసులు'లో జమున, హరనాథ్

సినా దర్శకుడు తాపీ చాణక్య రసవత్తరంగా చిత్రించారు — నవజ్యోతి ఫిలింస్ వారి "అడుగు జాడలు" చిత్రంలో. పార్వతి జమున, విజయ్ యన్. టి. రామారావు., ఇంకా యస్. వి. రంగారావు, రేలంగి, చలం, రమాప్రభ తారాగణంలో ముఖ్యులు.

## కొత్తసినిమా రచయిత్రి

కథకురాలిగా, నవలా రచయిత్రిగా శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మ 'ఆంధ్ర సచిత్రవారపత్రిక' పాఠకులకు సుపరిచితురాలు. ఆమె యిప్పుడు అన్నపూర్ణావారు నిర్మించనున్న "పూలరంగడు" చిత్రానికి సంభాషణలు సమకూర్చుతున్నారు. యద్దనపూడి సులోచనారాణి, భమిడిపాటి రాధాకృష్ణ, గొల్లపూడి మారుతీరావు వంటి రచయితల్ని వెండితెరకు పరిచయం చేసిన శ్రీ దుక్కిపాటి



"ఆస్తిపరులు"లో నాగేశ్వరరావు, జయలలిత

# చిత్రలహరి

మధుసూదనరావు గారు యీసిరి రంగనాయకమ్మను యీ చిత్రం ద్వారా సినిమా రచయిత్రిగా పరిచయం చేస్తున్నారు. కథ: ముళ్ళపూడి వెంకటరమణ, దర్శకుడు: శ్రీ ఆదుర్తి సుబ్బారావు. నాయకి జమున, నాయకుడు నాగేశ్వరరావు.





## ఇద్దరు మేధావుల కొత్తసంస్థ

దర్శకుడు ఆదుర్తి, నటుడు నాగేశ్వరరావు కలిపి "చక్రవర్తి చిత్ర" అనే కొత్త చిత్రనిర్మాణ సంస్థను నెలకొల్పారు. "ఇది కొద్దికాలం కిందటే స్థాపించబడినదనీ అక్టో-



'సంగీతలక్ష్మిలో' ఎస్. టి. రామారావు, జమున.

బరు, నవంబరులనుంచి యీ సంస్థ తాలూకు కార్యకలాపాలు ఆరంభమవుతవనీ ఇటీవల శ్రీ అక్కినేని నాగేశ్వరరావు వొక సందర్భంలో నాతో చెప్పారు.

—మోహన్‌కుమార్ ●

చిత్రసమీక్ష:

# మ మ తా

ఒకప్పుడు బెంగాల్ నుంచి వచ్చిన హిందీ చిత్రాలు దేశంలో మంచి పేరును సంపాదించాయి. తర్వాత బెంగాల్ చిత్ర పరిశ్రమ రాష్ట్రానికే పరిమితమై పోయింది. అయినప్పటికీ బెంగాలీ చిత్రా లనేకం జాతీయ, అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించాయి.

కానీ రంగుల్లో చిత్రాలను నిర్మించటం అన్నది, చిత్ర నిర్మాణ ఖర్చులన్నీ ఆకాశాన్ని అంటిన ఈ తరుణంలో కలకత్తాలో రంగులో చిత్రాన్ని నిర్మించడం అనేది పగటికల లాంటిది.

కానీ ఈ పగటి కలే బెంగాల్ భారతా పనికి తన మొట్టమొదటి హిందీ చిత్రం 'మమతా'ను సమర్పించటంతో నిజ మైంది. దేశం అంతటా ఈ చిత్రం 'కళాఖండంగా' కొనియాడ బడుతూంది.

మమత అనేది ఎంత పవిత్రమైందో, శక్తివంత మైనదో, విచిత్ర మైనదో ఈ చిత్రం నిరూపిస్తుంది. చారు చిత్ర వారు ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించిన ఈ చిత్రంలో అశోక్ కుమార్, ధర్మేందర్, సుచిత్రాసెన్‌లు ప్రధాన పాత్రధారులు. ఇతర పాత్రలలో కాళీపాద చక్రవర్తి, డేవిడ్, పహారీ సన్యాల్, బిపిన్ గుప్తా, అసిత్‌సెన్, భానుబెనర్జీ, జవార్ రాయ్, శ్యామ్‌లాహా, కుందన్, వినోద్ శర్మ, బల్‌దేవ్ మెహతా, ప్రతిమాదేవి, ఛాయా దేవి, బేబి తిరు మొదలగు వారు ఉన్నారు.

చిత్రంలోని ప్రతి పాత్రా అత్యంత సహజంగా రూపొందించ బడింది. అశోక్ కుమార్, సుచిత్రాసెన్‌లు అత్యంత ప్రతిభా వంతంగా నటించారు. దర్శకత్వం విషయంలో శ్రీ అసిత్‌సెన్ ప్రతిభా వ్యుత్పత్తులకు ఈ చిత్రం గీటురాయి అన వచ్చు. రోషన్ సంగీతం, జ్యోతి లాహా ఛాయా గ్రహణం వీనుల విందుగా, కన్నుల పండుగగా ఉన్నాయి. ఈ చిత్రం ప్రస్తుతం మద్రాసులోని 'మిడ్‌లాండ్' లో ప్రదర్శింపబడుతున్నది.

—మాధవ్



సతీష్‌చేత కేక్ తినిపిస్తున్న తల్లి సావిత్రి, అవతల జెమినీగణేశ్, మిసెస్ జెమినీగణేశ్, విజయ చాముండేశ్వరిలను ఈ చిత్రంలో చూడవచ్చు.

# సతీష్ జన్మదినోత్సవం

ప్రసిద్ధ సినీ నటి శ్రీమతి సావిత్రి, తమిళనటుడు శ్రీ జెమినీ ఆర్. గణేశన్‌లు తమ కుమారుడు చిరంజీవి రాజా యన్ సతీష్ కుమార్ ప్రథమ జన్మ దినోత్సవ సందర్భాన్ని పురస్కరించుకుని ఆగస్టు 18 వ తేదీన మద్రాసు లోని సంయుక్త గౌడ సారస్వత సభలో అల్పా హార విందు, వినోద ప్రదర్శనలను ఏర్పాటు చేశారు. ఆహూతు లందరికీ జెమినీ గణేశన్ దంపతులు [illegible] స్వాగతం చెప్పారు. చిన్న పిల్ల లందరికీ చిరంజీవి విజయ చాముండేశ్వరి స్వాగతం చెప్పింది.

ఈ సందర్భంలో మద్రాసు ముఖ్య మంత్రి శ్రీ ఎం. భక్తవత్సలం, సినీ పరిశ్రమలోని పలువురు, ఇతర ప్రము ఖులు, పత్రికా విలేఖరులు హాజరై చిరంజీవి సతీష్‌ను ఆశీర్వదించారు.

అల్పాహార విందు అనంతరం ప్రసి ద్ధ హాస్యనటుడు శ్రీ రమణారెడ్డి, శ్రీ పిళ్లై మాజిక్ ప్రదర్శనము, కార్టూన్ ఫిలిం ప్రొజెక్షన్ జరిగింది.



'ఆమ్రపాలి' లో వైజయంతిమాల

# శోభన్ బాబు

గ్రా చదువుతూ 1960 లో మద్రాసుకు వచ్చిన శోభన్‌బాబు మొదటిసారిగా 'భక్త శబరి' చిత్రంలో వేషం వేశాడు. అది కరుణ పాత్ర. మునికుమారుడు. బుద్ధుని తరహాకు చెందినటువంటిది. ఆ వేషంలో ఎంతో అందంగా, హుందాగా కనిపించాడు. తొలి చిత్రమయినా మంచిపేరు తెచ్చుకున్నాడు.



'సత్యమేజయం'లో శోభన్‌బాబు



శోభన్ బాబు

బాల్యం నుంచీ శోభన్‌బాబుకు నాటకాలన్నా, సినిమాలన్నా విపరీతమయిన మోజు. అవకాశం లభించినప్పుడల్లా నాటకాల్లో వేషాలు వేస్తూండేవాడు. ఆ కృషి, ఉత్సాహమూ అతను యివాళ చక్కని నటుడుగా రూపొందేందుకు కారణభూతా... వాటిలో ఉన్నవని చెప్పడంలో అ... ఉండదు. శోభన్‌లో పట్టుదల ఉంది. కార్య దీక్ష ఉంది. ప్రయత్నం చేస్తే ఎందుకు సాధించలేనన్న ధీమా ఉంది. అన్నింటినీ మించిన ఆత్మవిశ్వాసం ఉంది. వీటిని నమ్ముకుని మద్రాసు వచ్చాడు. అతని నమ్మకం వమ్ముకాలేదు. మంచి ఫలితాలనే ప్రసాదించింది.

భక్తశబరి తర్వాత సీతారామ కళ్యాణం, చదువుకున్న అమ్మాయిలు, భీష్మ, నర్తనశాల, వీరాభిమన్యు, లోగుట్టు పెరుమాళ్లకెరుక, పొట్టిప్లీడరు — మొదలయిన చిత్రాలలో నటించాడు. శోభన్‌బాబులో నిగూఢంగా వున్న నటన "వీరాభిమన్యు" చిత్రం ద్వారా బయటపడింది. అభిమన్యుడిగా అతను నటించలేదు. ఆ భూమికలో జీవించాడు. ప్రణయ, శృంగార, వీర, రౌద్ర రసాలను ఎంతో నేర్పుతో పోషించి అద్భుతంగా ఒప్పించగలిగాడు.

పొట్టిప్లీడరు చిత్రంలో హీరో రామారావుగాను, విలన్ భోగారావుగాను కూడ నటించాడు. ఒక నటుడు ఒకే చిత్రంలో పరస్పర భిన్నంగా వుండే రెండు పాత్రల్ని పోషించి రక్తి కట్టించడం కష్టసాధ్యమైన విషయం. ఆ పని శోభన్‌బాబు చేశాడు. సాధించాడు. వైవిధ్యం కనబరచి అందరి ప్రశంశల్నీ అందుకొనగలిగాడు. అతనికి ఏ వేషమిచ్చినా నెగ్గుకు రాగలడనే ధైర్యం యిప్పుడు నిర్మాతలలో ఏర్పడింది.

"శ్రీయుతులు రామారావు, నాగేశ్వరరావులు నాకు చిరస్మరణీయులు. అగ్రశ్రేణి నటుడుగా రూపొందాలనీ వారంతా కావాలనీ నా ఆకాంక్ష. అందుకోసం ఏ విధమయిన కృషి చేసేందుకయినా సిద్ధపడతాను" అంటాడు శోభన్‌బాబు. అంతేకాదు. "దర్శకులు చిత్తపు నారాయణమూర్తి, కె. కామేశ్వరరావు, వి. మధుసూదనరావు గార్లకు కృతజ్ఞుణ్ణి అనీ—వీరిలో శ్రీ వి. మధుసూదనరావుగారు విపరీతంగా శ్రమించి తనను ఒక నటుడుగా తయారు చేశారనీ కూడా అంటూ వుంటాడు.

అనంతలక్ష్మి ప్రొడక్షన్స్‌వారి "కాంభోజ రాజు కథ", రిపబ్లిక్ ప్రొడక్షన్స్ వారి "రక్తసిందూరం", ఇందిరారమణ వారి సత్యమేజయం, సిత్తి తమిళ చిత్రం ఆధారంగా శ్రీకాంత్ ప్రొడక్షన్స్‌వారు తెలుగులో నిర్మిస్తున్న సాంఘికం, ఉల్లాసపయనం ఆధారంగా సెవెన్‌హిల్స్ ప్రొడక్షన్స్‌వారి సాంఘికం—యిప్పుడు శోభన్‌బాబు ముఖ్యపాత్రలు ధరిస్తున్న చిత్రాలు. ఉల్లాసపయనం, తెలుగు వెర్షన్‌లో ద్విపాత్రాభినయం చెయ్యబోతున్నాడు. రక్తసిందూరంలో తండ్రిగాను, కొడుకుగాను వేస్తున్నాడు. అన్ని తరహాలకు చెందిన పాత్రలూ పోషించాలని వుంటుందనీ నటనలో తానింకా సాధించవలసింది ఎంతో ఉన్నదనీ చెబుతాడు శోభన్‌బాబు.

ఏమాత్రం తీరిక దొరికినా ఇంటి దగ్గరే ఎక్కువగా గడిపేందుకు ప్రయత్నిస్తాడు శోభన్. తెలుగు ఆంగ్ల సాహిత్యాల్లో తగినంత పరిచయం ఉన్నది. అతని లైబ్రరీ చూసిన వారికి ఆంగ్లసాహిత్యం అధికంగా కనిపిస్తుంది. కాని, తెలుగు కూడ అంతకు రెట్టింపు ఉంది. అందరితోను కలుపుగోలుతనంగా మాట్లాడడం, కలసిమెలసి ఉండడం అతని నైజం.

ఇచ్చిన కాల్‌షీట్ల ప్రకారం షూటింగులకు లకు సక్రమంగా హాజరవుతూ, తనకు వచ్చిన వేషం పట్ల శ్రద్ధాసక్తులు చూపి నటించే శోభన్‌బాబు లాంటి చక్కని నటుణ్ణి నియోగించుకొని చిత్రాలు నిర్మించుకునే నిర్మాతలకు ఎంతో సౌలభ్యమూ, లాభదాయకమ్మూ.

—మోహన్‌కుమార్

# పుస్తకాలు

## ప్రజాప్రభుత్వము

వ్యాసాల సంపుటి రచయిత: శ్రీ దిగవల్లి వేంకట శివరావు. ప్రచురణ, ప్రతులకు: ఆదర్శ గ్రంథ మండలి, విజయవాడ—2. పేజీలు 144. వెల రూ. 3—00.

ప్రజాప్రభుత్వం (Democracy) ప్రపంచంలో పరిమితంగానో, దాదాపు పూర్తిగానో, చాల దేశాల వుంది. ఈ గ్రంథంలోని వ్యాసాలలో ప్రస్తావించిన విషయాలు అన్ని దేశాల ప్రజా ప్రభుత్వాలలోని సామాన్యతను చూపలేదు. భారతదేశాన్నిగూర్చి కూడా సమగ్రంగా, విపులంగా వ్రాయలేదు. ఎక్కువగా బ్రిటిష్ ప్రజా ప్రభుత్వాన్ని గూర్చి చెబుతూ వున్నప్పుడు అక్కడక్కడా భారతదేశాన్నిగూర్చి వ్రాయబడింది.

సిద్ధాంతరీతిగా భారత ప్రజా ప్రభుత్వం ప్రపంచంలోని మంచి ప్రజా ప్రభుత్వాలలోని మంచికి మచ్చుతునుక! అయితే ఆ మంచి ఎక్కువగా బ్రిటిష్ ప్రజా ప్రభుత్వంనుంచి పుణికి పుచ్చుకొంది. మన రాజ్యాంగంలో దోషం కనబడితే బ్రిటన్‌లో ఇలా ఉండదు అని అనుకోవటం సహజమే అయింది. మన ప్రజా ప్రభుత్వ పరిపాలనలో, రాజ్యాంగ నిర్మాణంలో, నిర్వహణలో వున్న అవకతవకలు, అతివ్యాప్తి అనావ్యాప్తులు చూపించే దృష్టితో విజ్ఞానాత్మకమైన ఈ వ్యాస సంపుటి ప్రకటించిన విజ్ఞులు శ్రీ దిగవల్లి వేంకట శివరావు.

ఈ వ్యాస సంపుటిలో, అనేక కోణాలనుంచి భారత ప్రజాప్రభుత్వం నడుస్తున్న తీరు తులనాత్మక పరిశీలనకు గురి అయింది. మనదేశంలో పార్లమెంటుకుగానీ, అసెంబ్లీకిగానీ ఎన్నికయిన వ్యక్తి చాలాచోట్ల మళ్లీ అయిదేళ్లదాకా, కనీసం ఆ నియోజకవర్గం ఎలా వుందో గమనించే స్థితి ఉండదు. బ్రిటిష్ దేశంలో పొలిటికల్ క్లబ్స్ తాము ఎన్నుకొన్న వ్యక్తి రాజకీయ జీవితాన్ని ఎలా దిద్దుతాయో ఈ సంపుటిలో చదివితే, ఆశ్చర్యం కలుగుతుంది.

మరి ఆస్థితి మనదేశంలో ఎందుకులేదు? రాజకీయ చైతన్యం లేదు కాబట్టి. అదెలా సాధ్యం? అన్నిరంగాలలో అభివృద్ధివస్తే! అదెప్పుడు వస్తుంది? ప్రజా ప్రభుత్వం బాగా పని చేస్తే! అదెప్పుడు బాగా పని చేస్తుంది? ప్రజలు జాగరూకతతో వుంటే! జాగ్రత్త ఎప్పుడు వస్తుంది? రాజకీయ చైతన్యం వుంటే—మళ్లీ అదే చక్రం—

మొదట సాంఘిక చైతన్యం రావాలి. సంఘంలో వున్న అందరూ, దేవుడు—కర్మ—యోగం—జాతకం కంటే భిన్నంగా ప్రవర్తించి, అందరం సమానులమే అని భావం పెంచుకోవాలి. దానికి అవసరమైన చోటిలో భాష మతం ముఖ్యమే! ఒకే భాష, ఒకే మతం ఏర్పడితే—కనీసం ఆ భావం ఏర్పడితే— భారతదేశంలో సాంఘిక చైతన్యం వస్తుంది.

సాంఘిక చైతన్యంవస్తే ఆర్థిక చైతన్యంవచ్చే అవకాశం దగ్గరలో ఉండదు. అందుకు గుర్తించవలసింది దేశస్థితి. మనదేశంలో వ్యవసాయరంగం సాధించగలిగినంత పురోగతి పారిశ్రామికరంగం సాధించలేదు. దానిలోను ప్రభుత్వరంగం బలపడి, ప్రయివేటురంగం బలహీనమైతే, బలహీనమయ్యేట్లు చేస్తే తప్ప, పారిశ్రామికరంగానికి మోక్షంలేదు. వ్యవసాయం, పరిశ్రమ నిరాఘాటంగా సాగితేతప్ప, గత్యంతరంలేదు. ఆ రెండు విధాలా అభివృద్ధి అయితే ప్రపంచ ఆర్థిక స్థితిలో భారతదేశం కొటికోణం అందుకొంటుంది. ఆర్థిక చైతన్యంతో తక్షణం రాజకీయ చైతన్యం వస్తుంది. అది పూర్తిగా వస్తే ప్రజా ప్రభుత్వం సహాటికి నూరుపాళ్ళు విజయవంతం.

బ్రిటన్‌లోమంత్రులుచూపే బాధ్యతలు మన మంత్రులు చూపటంలేదు. అక్కడ అపోజిషన్ పార్టీ చూపే దక్షత, దీక్ష, మన అపోజిషన్ పార్టీలు చూపటంలేదు. ఆ దేశంలో ప్రభుత్వం ఒకపార్టీ చేతుల్లోంచి మరొకపార్టీ చేతుల్లోకి మారినట్లు, ఆ మార్పు మంచికోసమే వచ్చినట్లు మనదేశంలో రావటం లేదు. రాదు. అన్ని దేశాల ప్రజా ప్రభుత్వాలలోని సుగుణ సంపత్తిని ఏరి కూర్చినా భారత ప్రజాప్రభుత్వం సర్వశ్రేష్ఠంగా రూపుదాల్చలేదు. దీనికి కావల

# పుస్తకాలు

సంధి మారుతున్న దేశంలో మారవలసిన సర్వ ప్రజా మనస్తత్వం.

ఈ వ్యాస సంపుటి, బహుగ్రంథ పరిశీలనతో తయారయింది. ఆంగ్లంలో బ్రిటిష్ ప్రజాప్రభుత్వం గూర్చి వెలువడిన గ్రంథాలూ, భారత రాజ్యాంగ చట్టమూ, ఈ రెండు దేశాల రాజ్యాంగ నిర్మాణం గూర్చిన గ్రంథాలు ఆధారంగా, ఆంధ్రంలో ఈ వ్యాస సంపుటి తయారయింది. పలుతావుల్లో రచయిత వ్యక్తం చేసిన స్వతంత్రాభిప్రాయాలు సూక్ష్మ పరిశీలనానంతర ప్రపంచిత రాజకీయభాష్యాలు.

సంపుటిలో ఎక్కువభాగం అనువాదమే! అనువాదం చాలావరకు స్పష్టత సంతరించుకొంది.

భారత రాజ్యాంగచట్టంలోని కొన్ని అంశాలు అనువాదం చేయటంలో కొన్నిచోట్ల అతివ్యాప్తి, అనావ్యాప్తి కలిగాయి.

అనువాదం ఎలా జరిగిందో మచ్చుకు.

"ప్రజా ప్రతినిధులవలన, ప్రజల క్షేమ లాభముల కొరకు, ప్రజాభిప్రాయముగా జరుపబడు ప్రభుత్వమే ప్రజా ప్రభుత్వము."

దీనికి మూలాంగ్లం.

Democracy is a form of government of the people, by the people, and for the people.

ఆంగ్లంలోని కొన్ని పదాలకు పూర్ణాత్మస్ఫూర్తి కలిగించే తెలుగుమాటలు తక్కువ. రచయిత శ్రీ దిగవల్లి వేంకట శివరావు కొన్నింటికి చూపిన తెలుగు పదాలు—

ఉదా : Directive principles=నిర్దేశక సూత్రములు.

Fundamental Rights=ప్రాతిపదిక సత్యాలు

Veto=ప్రత్యాఖ్య

Prerogatives=విశేషాధికారములు. రాజ్యాంగ విశిష్టాధికారములు.

Instrument of Instruction=ప్రజ్ఞాపన పత్రము

Dissolve=విలయము.

Trade Unions=కట్టడి సంఘములు.

Preventive Detention=నివారక నిరోధము. ఇట్టివి చాలా వున్నాయి. వీటి యోగ్యతాయోగ్యతలు పాఠకులే నిర్ణయిస్తారు.

రాజ్యాంగమూ, పుట్టుపూర్వోత్తరాలూ! ప్రజాప్రభుత్వమూ, పరిపాలనావిధానమూ, ఈ విషయాల గూర్చి ఆంధ్ర గ్రంథాలు తక్కువ. ఆ లోటును ఈ గ్రంథం కొద్దిగా తీర్చగలదు. రచయిత విషయమంతా ఆకళింపు చేసుకొని, జీర్ణించుకొని, చాలామందికి అర్థమయ్యే రీతిలో వ్యక్తీకరించిన ఈ వ్యాస సంపుటి చదవదగింది.

—రవి.

## జాతీయ నాయక మణిమాల

ఈ శీర్షిక కింద 1. మహాత్మాగాంధి, 2. లాలా లజపతిరాయి, 3. సర్దార్ పటేలు, 4. దాదాభాయి నౌరోజి, 5. అనీబిసెంటు, 6. చిత్తరంజన్‌దాసు, 7. డాక్టర్ రాధాకృష్ణ 8. బాలగంగాధర్ తిలక్— వారి జీవిత చరిత్రలని వేరు వేరు పుస్తకాలుగా ప్రచురిస్తున్నారు.

వెంకట్రామ అండ్ కో వారు వెలువరించిన ఈ గ్రంథాల రచయితలు వరుసగా 1. శ్రీ ఎన్. సి. ఎస్ పార్థసారథి, 2. శ్రీ పోలాప్రగడ సత్యనారాయణ మూర్తి, 3, 4. శ్రీ ఎన్. సి. ఎస్. పార్థసారథి, 5. శ్రీ కొండముది శ్రీరామచంద్ర మూర్తి, 6. శ్రీ పోలాప్రగడ సత్యనారాయణ మూర్తి, 7. శ్రీ ఎస్. టి. పి. వి. రామకృష్ణాచార్యులు, 8. శ్రీ ఎన్. సి. ఎస్. పార్థసారథి.

అందరికీ అందుబాటులో ఉండే వెలతో, చక్కని ముద్రణతో, అట్టమీద ఆ, ఆ మహానుభావుల బొమ్మలతో ఈ పుస్తకాలు ప్రజాదరణ పొందగలవు. ప్రచురణ కర్తలు, "ఈ పుస్తకములలో వాడుక భాషకు చేర్పుగా నుండు గ్రాంథికము వ్రాయబడినది" అని 'ప్రకాశకీయము'లో అన్నారు. (ఓ. న)



Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Phone: Editorial 21747; Other depts: 29766. Chief Editor: S. Sambhu Prasad.

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA



నిర్మల